Photo by: VIDYAVRATA



GOD of PROSPERITY







రామ్,
శ్యామ్‌ల
ధననిధి వేట



దొరికింది దొరికింది-ఒక పుస్తకంలో దొరికింది! కాప్టెన్ కుక్ దాచిన ధననిధి నక్షా



ఇద్దరు పరుగెత్తి-పడవలో ఎక్కేరు సొమ్ము వెతుకుతూ సముద్రాల దాటేరు



రోజులు దొర్లాయి-తుఫాను లేచింది



గండాలు తప్పి ఇద్దరు-ఒక ఒడ్డు మీద పడ్డారు



రోజంతా తిరిగి-గుడిసె ఒకటి చేరేరు



ఒంటరి తాత నిద్రపోవ్వుల చూచేరు-తాతను లేపి తను నక్షాను చూపేరు



తాత వారికిచ్చేడు ఇంకొక ధననిధి-పాపిన్స్! పాపిన్స్-తీయని బిళ్ళల నిధి



నోరూరించే, మనసుదోచే మై మరపించే
పార్లే
పాపిన్స్
పండ్ల రుచిగల
పిప్పరమెంట్లు
PARLE
POPPINS
5 పండ్ల సువాసనలలో
13 మధురమైన బిళ్ళలు
ప్రతి ప్యాక్‌లో నిమ్మ, మోసంబి,
నారింజ, అనాస మరియు రాస్ప్‌బెరీ!

## చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి. ఆలస్యమైతె మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.


డాల్టన్ ఏజన్సీస్

'చందమామ బిల్డింగ్స్'

మదరాసు - 600 026



కృష్ణంరాజు సమర్పించు

గోపీకృష్ణా మూవీస్ వారి

# కృష్ణవేణి

ఈస్ట్‌మన్‌కలర్

దర్శకత్వం: వి. మధుసూదనరావు   నిర్మాత: చలసాని గోపి











లక్ష్మీ ఫిలింస్ రిలీజ్

# సరిగ్గా ఆడాడు...

























ఫోర్‌హాన్స్

దంతవైద్యునిచే సృష్టింపబడిన టూత్ పేస్ట్

49F-203R-TEL

# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ [''రాజకుమారుడు''] ఐంద్రజాలికుడు, ఏ. సి. సర్కార్ రచన. మూఢత్వం నుంచి బయటపడని ప్రజలు మోసగాళ్ళను నమ్మినంత తేలికగా సమర్థులను నమ్మరు. ఈ విషయం ఏప్రిల్ సంచిక, ''అమరవాణి'' శ్లోకంలో వున్నది. ఇదే నీతి ''మంత్రించిన నిమ్మకాయ'' అన్న కథలో చూస్తాం. జనులకు మేలు చేయగోరేవాడు ఒక్కొక్కసారి తానే మోసం చేయటం అవసరం అవుతుంది.

సంపుటి 55 జూలై '74 సంచిక 1





# అమరవాణి

" అంగుళ్యా కః కవాటం ప్రహరతి ? " " కుటిలే,
మాధవః. " " కిం వసంతః ? "
" నో చక్రీ. " " కిం కులాలో ? " " నహి ధరణీధరః. "
" కిం ద్విజిహ్వః ఫణీంద్రః ? "
" నాహం ఘోరాహిమర్దీ. " " కిముత ఖగపతిః ? "
" నో హరిః. " " కిం కపీంద్రః ? "
ఇత్యేవం సత్యభామాప్రతిజితవచనః
పాతు వ శ్చక్రపాణిః.

సత్య: "వేలితో తలుపు తట్టేది ఎవరు?"
కృష్ణ: "కొంటిపిల్లా, మాధవుణ్ణి."
సత్య: "వసంతుడా?" (మాధవు డంటే వసంతు డనే అర్థం కూడా ఉన్నది.)
కృష్ణ: "కాదు, చక్రిని" (చక్రం ధరించే వాణ్ణి).
సత్య: "కుమ్మరివా?" (చక్రి అంటే కుమ్మరి అనే అర్థం కూడా ఉన్నది.)
కృష్ణ: "కాదు, ధరణీధరుణ్ణి." (భూమిని ఉద్ధరించిన విష్ణువును.)
సత్య: "రెండు నాలుకలు గల నాగరాజువా?" (ధరణీధరుడు ఆదిశేషుడు కూడా.)
కృష్ణ: "ఘోరమైన పామును మర్దించిన వాణ్ణి." (ఆ పాము కాళీయుడు.)
సత్య: "గరుత్మంతుడవా?"
కృష్ణ: "కాదు, హరిని."
సత్య: "కోతివా?" (హరి అంటే కోతి అనే అర్థం కూడా ఉన్నది.)

ఇలా సత్యభామ చేత మాటలలో ఓడిపోయిన కృష్ణుడు మిమ్మల్ని రక్షించుగాక.

---

సత్యభామా కృష్ణుల సంవాదం.

---



కొన్ని వేల సంవత్సరాల క్రిందట శ్రావస్తి నగరాన్ని దానశీలు డనే రాజు పరిపాలి స్తూండేవాడు. ఆ చుట్టుపక్కల రాజు లందరిలోకీ దానశీలుడే గొప్ప. ఏమంటే, లక్షల కొలది సైన్యం వుంది. దాసదాసీ జనాలకు లెక్కలేదు. ఇక ఆ రాజు ధనా గారం రత్నాలు, మొహరీలు, వజ్రాలు, వైడూర్యాలు మొదలైన అన్ని రకాల వెలలేని మణులతోనూ వెండి, బంగారు ధనరాసులతోనూ నిండి వుండేది. అన్ని టినీ మించిన అదృష్టం అనుకూలవతి, అపురూప సౌందర్యరాశి అయిన కాంతి రేఖ రాజుకు రాణీ కావటమే. మరో గొప్ప విషయం ఏమిటీ అంటే, ఇంత ఐశ్వ ర్యంతో తులతూగుతున్నా ఆ రాజుకు ఏకోశానా గర్వం అనేది లేదు. దైవ భక్తి కూడా అపారం. ఇక ఆయన చేసే దానధర్మాలకు అంతేలేదు. యాచ కులకు లేదనకుండా ఏదో ఒకటి యిచ్చి పంపేవాడు. ఆ కారణం చేతనే రాజు దానశీలుడు అనే తన పేరు సార్థక పరుచుకున్నాడు.

ఇలా వుండగా కొన్నాళ్ళకు ఒక పెద్ద అవాంతరం వచ్చింది. ఎంతో ఆరోగ్యంగా తిని తిరుగుతున్న రాణీ కాంతిరేఖ వున్న ట్టుండి హఠాత్తుగా చనిపోయింది. రాజు కంటికి మంటికి ఏకధారగా ఏడ్చాడు. ప్రజల దుఃఖానికి అంతేలేదు. కాని ఎంత ఏడ్చి, చనిపోయిన రాణీని తిరిగి బతికించటం ఎవరివల్ల అవుతుంది?



క్రమంగా రోజులు గడుస్తున్న కొద్దీ రాజూ, ప్రజలూ కూడా చనిపోయిన రాణిని గురించి తలచటం మానివేశారు. ఇప్పుడు అందరికీ ఒకే ఒక దిగులు పట్టుకుంది. రాణి కడుపున సంతానం కలగక ముందే చనిపోయింది. తమ రాజు తదనంతరం, రాజ్యం పరులపాలు కాకుండా వుండటానికి రాజు తిరిగి వివాహం చేసుకుని, సంతానం పొందటం అవసరం. మంత్రులూ, సామంతులూ రాజును తిరిగి వివాహం చేసుకోమన్నారు. రాజు ఒప్పుకోక తప్పిందికాదు. ఒక సుముహూర్తాన రాజు తిరిగి వివాహం చేసుకున్నాడు. కాని, దురదృష్టమేమో కాని రెండవ భార్య కూడా కొద్ది రోజులకే ఆకస్మికంగా చనిపోయింది.

ఈ వార్త ఆ రాజ్యంలో ప్రజలందరి నోటా పడి, క్రమంగా చుట్టుపక్కల రాజ్యాలకు కూడా పాకిపోయింది. మంత్రులూ, సామంతులూ ఈ సారి కూడా రాజును తిరిగి మూడో వివాహం చేసుకోమని వేడుకుని, ఎలాగైతేనేం రాజు చేత ఒప్పించకలిగారు. కాని, రాజుకు భార్య అయిన ఇల్లాలు పెళ్ళి అయిన కొద్ది రోజులకెల్లా చనిపోతూన్న దన్న వార్త విన్న తర్వాత, ఏ తండ్రి చూస్తూ చూస్తూ తన బిడ్డను మృత్యు ముఖంలోకి పంపటానికి ఒప్పుకోగలడు? రాజవంశీయులు కాదుగదా, కడకు సామాన్య సంసారులు సైతం తమ పిల్లను రాజుకు ఇవ్వటానికి ఒప్పుకోలేదు. అయినా పట్టువిడవకుండా మంత్రులూ, సామంతులూ దేశం నలుమూలలా యింకా వెతుకుతూనే వున్నారు.

అలా వెతకగా వెతకగా కొన్నాళ్ళకు తన కుమార్తెను ఇవ్వటానికి ఒక పేదరాలు ఒప్పుకున్నది. ఆ పిల్ల బీద వంశంలో పుట్టినప్పటికీ అందచందాలలో ఏ రాజ కుమార్తెకూ తీసిపోలేదు. అతిరూప సౌందర్యరాశి అయిన ఆ పిల్లను చూచి మంత్రులూ, సామంతులూ ఉప్పొంగి

పోయారు. వెంటనే ఈ వార్త రాజుకు అందజేశారు. ఒక సామాన్య స్త్రీ యీ సారి తనకు రాణీ కాబోతుందని తెలిసినప్పుడు రాజు విచారించలేదు సరికదా, ఎంతో సంతోషించి మంత్రులతో, "మృత్యు దేవతకు బీదలైనా ఒకటే, భాగ్యవంతులైనా ఒకటే. ఇంత ఐశ్వర్యంతో తుల తూగుతున్నా, నా రాణులను రక్షించుకో గలిగానా? బతికే యోగం వుంటే ఎవ రైనా బతుకుతారు. కనుక మీరు చూచి వచ్చిన ఆ స్త్రీని చేసుకోవటానికి నాకు అభ్యంతరము లేదు," అన్నాడు.

ఇది విన్న మంత్రులు ఉత్సాహభరితులైనారు. మరి కొద్ది రోజులకల్లా మంచి ముహూర్తాన రాజుకూ, ఆ పేదరాలి కూతురుకూ వివాహం ఏర్పాటు చేశారు. వివాహం సలక్షణంగా జరిగేవరకూ ఎవ రికీ గుండెధైర్యం లేదు. ఎందువల్లనంటె, అంతకుముందు రాజు వివాహం చేసుకున్న రాణులు కూడా వివాహం అయిన తర్వాత ఒక వారం తిరక్కుండానే చనిపోయారు.

కాని యీ సారి అలా జరగలేదు. క్రమంగా రోజులు, నెలలు ఏ అవాంతరమూ లేకుండా గడిచిపోయినై. అప్పటికి రాజుకూ, మంత్రులకూ, ప్రజలకూ కొంత ధైర్యం చిక్కింది. నాటినుంచీ ప్రజలు, "ఈ మూడవ భార్యవల్లనైనా మా రాజుకు సంతానం ప్రసాదించు, తండ్రీ!" అని దేవుడిని ప్రార్థించసాగారు.





ప్రజల ప్రార్థన దేవుడు విన్నాడు కాబోలు, మరో నెలకల్లా రాణి గర్భవతి అయినట్టు వార్త పాక్కింది. ఈ వార్త విన్న ప్రజల సంతోషానికి మేర లేక పోయింది. ఇక రాజు, అతని పరివారం సంగతి చెప్పేదేమిటి?

క్రమంగా నవమాసాలూ నిండి, మంచి నక్షత్రాన రాణీ పద్మముఖి సుఖప్రసవమై ముగ్గురు కవలల్ని కన్నది. కాని తమ వంశోద్ధారకుడుగా ఒక పుత్రుడు పుడతా డని ఎంతగానో ఆశతో ఎదురు చూస్తున్న రాజు, పుట్టిన ఆ ముగ్గురు కవలలూ ఆడపిల్లలే అని విన్నప్పుడు కొంత నిస్పృహ చెందకపోలేదు. అయినా, రాజు తన నిస్పృహ పైకి ఏ మాత్రం కనబరచలేదు. నాకు మగపిల్లలైనా, ఆడ పిల్లలైనా వీళ్ళే—అనుకొని మనస్సును సమాధానపరుచుకున్నాడు. ఏమైతేనేం, ఆ ముగ్గురు కవలల్ని రాజూ, రాణీ ఎంతో అల్లారుముద్దుగా పెంచుకుంటున్నారు.

ముగ్గురు పిల్లలకూ తల్లిదండ్రులు వరుసగా సుహాసిని, సుభాషిణి, సుకేశిని అని నామకరణం చేశారు. క్రమంగా ముగ్గురు పిల్లలూ, ఆ ఏటికాఏడు పైబడిన కొద్దీ, చక్కటి అందాల బరిణెలుగా తయారవుతున్నారు. ఆ పిల్లల చక్క దనాన్ని చూసిన వాళ్ళు, "ఒక్కొక్క కుమార్తె పదిమంది కొమాళ్ళ పెట్టు!" అని మెచ్చుకొనేవారు.

ఇంతటి ఆనందంలోనూ మధ్య మధ్య ఒక చిన్న అవాంతరం వచ్చి రాజునూ, రాణినీ కంగారు పరుస్తూండేది. ముగ్గురు పిల్లలలోనూ ఎవరో ఒకరు ఏదో ఒక అపాయంలో చిక్కుకోవటం, మళ్ళీ ఎలాగో తప్పుకోవటం జరుగుతూ వుండేది.

ఒకసారి సుహాసిని, తండ్రితో తోటలో షికారు చేస్తూండగా ఒక పెద్ద సర్పం ఆ పిల్లను కాటువెయ్యటానికి వచ్చింది. సమయానికి రాజు తన కత్తితో ఆ సర్పాన్ని నరికేశాడే గాని, లేకపోతే ఆ నాటితో సుహా సినికి, లోకానికీ ఋణం తీరిపోయేదే.

మరొకసారి సుభాషిణి, తల్లితో నది ఒడ్డుకు షికారుకు వెళ్ళింది. అంత వరకూ ప్రశాంతంగా వున్న నది, ఒక్క సారిగా పొంగి, ఒడ్డున నిలుచున్న సుభాషిణిని లోపలికి ఈడ్చుకు పోయింది. దైవానుగ్రహం వల్ల సరీగా ఆ సమయానికి ఒక పల్లెకారి ఆ చోటికి రావటం, రాణీ కంగారుపడుతూ వుండటంచూసి, వాడు నదిలోకి దూకి ఎలాగైతే నేం సుభాషిణిని ప్రాణాలతో బైటికి తెచ్చి బతికించటం జరిగింది. ఆ పల్లెకారే అటు రాక పోతే నాటితో సుభాషిణి నదీ గర్భంలో కలిసిపోయివుండును.

ఇదేవిధంగా మరొకసారి మూడవపిల్ల సుకేశిని ఒక గండం గడిచి బైటపడింది. అది ఏమిటీ అంటే—ఒక రోజున సుభాషిణీ, సుహాసినీ, సుకేశినీ కలిసి తోటలో పూలు కోయటానికి వెళ్ళారు. ముగ్గురూ మూడు బుట్టల్లో పూలు కోసుకుని తిరిగి మేడకు బయలుదేరారు. ముందు సుభాషిణీ, ఆ పిల్ల వెనక సుహాసినీ, ఆ వెనక సుకేశినీ నడుస్తున్నారు. ఇంతలో వున్నట్టుండి సుకేశిని కెవ్వున కేకపెట్టి పడిపోయింది. మిగతా పిల్లలిద్దరూ హడలిపోయి, తల్లి దగ్గరకు పరిగెత్తి జరిగిన సంగతి చెప్పారు.

తల్లి, వాళ్ళను వెంటబెట్టుకుని సుకేశిని పడివున్న చోటుకు వచ్చిచూడగా, పక్కనే పూలబుట్ట, ఆ పూలలో పాకుతూ వున్న ఒక మండ్రగబ్బ కనిపించినె.





అప్పటికి తెలిసింది రాణికి, మంత్రగబ్బ కుట్టటం వల్లనే సుకేశిని అలా పడి వుంటుందని. దానిని చంపి ఆమె వెంటనే పిల్లను ఎత్తుకుని మేడకు తిరిగి వచ్చింది. ఆస్థాన వైద్యుడికి కబురంపగా, ఆయన వచ్చి ఏదో మందు వేశాడు. కొంతసేపటికి తిరిగి సుకేశిని లేచి మాటాడ సాగింది.

ఇలా, లేక లేక తమకు కలిగిన ఈ ముగ్గురు పిల్లలలో ఎప్పుడూ ఎవరికో ఒకరికి ఏదో ఒక గండం రావటం చూసే సరికి రాజు మనస్సు పరిపరి విధాల పోయింది. ఆయన తహ తహ లాడి పోయాడు. ఉండబట్టలేక ఒక రోజున జ్యోతిష్కుణ్ణి పిలిపించి, తన కుమార్తెలు ముగ్గురి జాతకాలు చూపించాడు.

జ్యోతిష్కుడు చాలాసేపు దీర్ఘంగా ఆలోచించి, తర్వాత ఏమీ చెప్పకుండా వూరుకునే సరికి రాజు ఆరాటం మరింత హెచ్చింది. ఆయన జ్యోతిష్కుడితో, "ఏదో అనుమానిస్తున్నట్టున్నారే? ఉన్న దున్నట్టు చెప్పండి. నిజం వెల్లడిస్తారనే ఉద్దేశంతోనే మిమ్మల్ని రప్పించాను," అంటూ ఆప్యాయంగా జ్యోతిష్కుడి భుజం తట్టాడు.

అప్పుడు జ్యోతిష్కుడు, "ఈ పిల్లలు చాలా అంద చందాలతో వెలిగిపోతూ వుంటారు. ఆ నాటి కా నాటికీ వారి అందం వృద్ధి పొందుతుందేగాని, తీసి పోదు. కాని విచారించ వలసిన విషయం ఏమిటీ అంటే, వీరి అపురూప సౌందర్యమే వీరికి శత్రువవు తున్నది. వీరు పుట్టిన దగ్గిర్నుంచీ ఎప్పుడూ ఏదో ఒక గండం దాటవలసి వస్తూనే ఉండాలే...." అని ఆగాడు.

జ్యోతిష్కుడి నోటి వెంట వచ్చిన ప్రతి ఒక్క మాటకు రాజు గుండె తరుక్కు పోతోంది. ఆయన కంటి వెంట ఏకధారగా కన్నీరు కారటం చూచి జ్యోతిష్కుడు మాట మధ్యలో ఆగాడు. కాని రాజు ఎంత కష్టానికైనా ఓర్చుకుని

జాతకంలోని నిజా నిజాలు తెలపవల సిందని పట్టు బట్టాడు. ఆయన జ్యోతి ష్కుణ్ణి, ''ఆగారేం? చెప్పండి.'' అని హెచ్చరించాడు.

''నిజం చెప్పి మీ మనస్సు కష్టపెట్ట వలసి వచ్చిందే అని విచారిస్తున్నాను.'' అన్నాడు జ్యోతిష్కుడు.

''ఫరవాలేదు, చెప్పండి. నా చిట్టి తల్లుల్ని నా శాయశక్తులా రక్షించుకోవ టానికి ప్రయత్నిస్తాను. మీరు వున్న సంగతి దాపరికం లేకుండా చెప్పండి.'' అని దైన్యావస్థతో అడిగాడు రాజు.

అప్పుడు జ్యోతిష్కుడు యిలా చెప్పాడు: "మన అమ్మాయిలకు ఏడేళ్ళు నిండే వరకూ దిన దిన గండం నూరే ళ్ళాయుస్సు అన్నట్టుగానే వుంటుంది. కాని, ఈ ఏడేళ్ళూ గండాలన్నీ గడిచి బైటపడ్డారంటే యిక మన అమ్మాయిలకు ఎటువంటి భయమూ లేదు. కనుక ఏడేళ్ళు నిండే వరకూ పిల్లలను కంటికి రెప్పలా కాపాడుకో గలిగితే మనం ధన్యు లమే. ఇంతకు మించి జాతకంలో చెప్ప తగ్గ విశేషం లేదు.''

రాజు, జ్యోతిష్కుణ్ణి అనేక విధాల సత్కరించి పంపివేశాడు. తర్వాత రాణీ దగ్గిరకు వచ్చి, జ్యోతిష్కుడు చెప్పిన విషయాలన్నీ చెప్పలేక చెప్పలేక ఎలాగో మనసు విడిచి చెప్పాడు. వింటూ వింటూ రాణీ స్పృహ తప్పి పడిపోయింది.

దాస దాసీలు ఉపచారం చెయ్యగా కొంతసేపటికి రాణీకి స్పృహ వచ్చింది. రాజు ఆమెను ఓదారుస్తూ వుండగా, పిల్లల్ని కాపాడుతున్న దాది పరిగెత్తు కుంటూ వచ్చి, ''మన అమ్మాయిలు ముగ్గురూ స్పృహ తప్పి పడిపోయా రమ్మా, తోటలో,'' అంటూ గొల్లున ఏడ్చింది.

రాణీ కంగారు పడుతూ తోట వైపుకు పరుగెత్తింది. దాది ఆమె వెంటపడింది. ఆస్థాన వైద్యుడికి కబురు పంపారు. రాజు కూడా తోట వైపుకు పరుగెత్తాడు.

—(ఇంకావుంది)





# రాజకుమారుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీకు ఏ రాజకుమార్తెగాని పరీక్ష పెట్ట లేదు గద? అలాటి పరీక్షలకు అర్థం ఉండదు. అందులో ఎవరు ఎందుకు గెలుస్తారో తెలియదు. ఇందుకు నిదర్శనంగా నీకు హిమబాహు కుమార్తె అయిన హిమానీ స్వయంవరం కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం హిమాలయ పర్వతాల మధ్యగా, ప్రవేశించటానికి దుస్సాధ్యమైన ఒక లోయులో హిమగథం అని ఒక రాజ్యం ఉండేది. దాని చుట్టూ నిట్రమైన కొండలుండేవి. బయటి నుంచి

## బేతాళ కథలు



19



లోయలోకి ఒకే ఇరుకైన కనుమ దారి ఉండటంచేత పైవాళ్ళు ఆ రాజ్యంలోకి సాధారణంగా అడుగుపెట్టేవారు కారు.

హిమగధ రాజ్యాన్ని హిమబాహు అనే రాజు పాలించేవాడు. ఆయనకు హిమానీ అని ఒక కుమార్తె కలిగింది. హిమబాహుడికి మరి వేరే సంతానం కలదని కారణంచేత తండ్రి సింహాసనానికి ఆమె వారసురాలయింది.

హిమానీకి పదహారేళ్ళు నిండగానే తండ్రి ఆమె వివాహం గురించి ఆలోచించసాగాడు. ఆమెకు తగిన వరుణ్ణి చూడటం ఒక పెద్ద సమస్యగా పరిణమించింది. ఎందుకంటే, ఆమెను పెళ్ళాడేవాడు రాజకుమారుడై ఉండాలి; రాజ్యపాలనలో ఆమెకు సహాయపడగలవాడై ఉండాలి. అలాటి వాడి కోసం వెతకాలన్నా తేలిక కాదు. హిమగథం మిగతా ప్రపంచానికి సంబంధం లేని చోట ఉన్నది. ఇతర దేశాల వాళ్ళు అష్టకష్టాలు పడి ఆ దేశానికి రారు.

అయితే హిమబాహుడి వద్ద పావురాలు ఉన్నాయి. తన కుమార్తెకు వరుడు కావాలని ప్రకటిస్తూ పత్రాలు రాసి, వాటిని పావురాలకు కట్టి, ఆ పావురాలను అన్ని దిక్కులకూ ఆయన పంపాడు.

ఆ కాలంలో సముద్రతీరాన సమతాత దేశం ఉండేది. ఒకనాటి రాత్రి ప్రళయంగా ఉప్పెన వచ్చి ఆ దేశాన్ని ముంచేసింది. రాత్రికి రాత్రే రాజభవనాలూ, పొలాలూ, ప్రజలూ సముద్రం వాత పడిపోవటం జరిగింది. ఇది జరిగిన సమయంలో, సమతాత రాజకుమారుడు, సముద్రసేనుడు అనే పదేళ్ళ బాలుడు ఒక బౌద్ధమఠంలో ఉంటూ, విద్యాభ్యాసం చేస్తూ ఉండటం వల్ల బతికిపోయాడు. సమతాతదేశం నామరూపాలు లేకుండా పోవటంతో, ఆ కుర్రవాడు బౌద్ధమఠంలోనే ఉండిపోయి, సకల విద్యలలోనూ పారంగతుడయాడు. మఠానికి చెందిన బౌద్ధసన్యాసులు అతన్ని

శ్రద్ధగా చూసి, అతనికి అనేక విద్యలతో బాటు ఇంద్రజాలవిద్య కూడా నేర్పారు.

కాలం గడిచిపోయింది. సముద్ర సేనుడు ఇరవై రెండేళ్ళ యువకుడు అయాడు. ఆ సమయంలోనే హిమానీ వివాహ వార్త దేశదేశాలకూ పాకింది. అనేకమంది రాజకుమారులు హిమగథా నికి పోవటానికి ప్రయత్నించి విఫలు లైనట్టు కూడా చెప్పుకున్నారు. సముద్ర సేనుడు, తాను కూడా ప్రయత్నించి వెళ్ళి, హిమానీ రాజకుమార్తెను పెళ్లాడా లనుకున్నాడు. అతను మఠాధిపతి వద్దకు వెళ్ళి తన అభిప్రాయం చెప్పాడు.

"తప్పక వెళ్ళు, నాయనా, నువు రాజకుమారుడివి. నీకు రాజోచిత విద్య లన్నీ చెప్పాం. కాని, నువు వెళ్ళే చోటికి ప్రయాణం చాలా కష్టం. అక్క డికి ఒకే దారి ఉన్నది. అది కూడా చాలా ప్రమాదకరమైన దారి. మచ్చిక అయిన ఖడ్గమృగం తప్ప నిన్ను ఆ దారిన హిమగథం చేర్చలేదు," అన్నాడు మఠాధిపతి.

మర్నాడే సముద్రసేనుడు వేటకు వెళ్ళి, అరణ్యంలో ఒక ఖడ్గమృగాన్ని వలలు వేసి పట్టి తెచ్చి, వారం రోజు లలో మచ్చిక చేశాడు. తరవాత అతను మఠం వాళ్ళ వద్ద శలవు పుచ్చుకుని, ఖడ్గమృగం మీద బయలుదేరాడు.

అతను మూడు వారాలపాటు ప్రయాస పడి ప్రయాణం చేసి, ఎలాగైతేనేం హిమ





"ఇద్దరు రాజకుమారులు అమ్మాయిని పెళ్లాడ వచ్చారు. ఏం చెయ్యాలి?" అని హిమబాహు మహారాజు తన మంత్రిని అడిగాడు.

"ఏం చెయ్యాలో నేనే చూసుకుంటాను. ఆ సంగతి నాకు వదిలిపెట్టు, నాన్నా," అన్నది హిమానీ.

"ఏం చేద్దామనుకుంటున్నావు?" అని రాజు అడిగాడు.

"ఒక పరీక్ష పెడతాను. అది ఎలా ఉంటుందో నువే చూస్తావు," అన్నది రాజకుమార్తె హిమానీ.

రాజు ఇద్దరు రాజకుమారులతోనూ, కొద్ది రోజులపాటు విశ్రాంతి తీసుకోమనీ, ఈ లోపల రాజకుమార్తె తన భర్తను తాను వరిస్తుందనీ చెప్పాడు. వాళ్ళు ఇంతవరకు రాజకుమార్తెను చూడనైనా లేదు. ఆమెను చూడాలన్న కోరిక వారికి త్వరలోనే తీరింది.

ఒకరోజు ఉదయం రాజకుమార్తె పరిచారిక వచ్చి హీరకకుమారుణ్ణి రాజోద్యానానికి తీసుకుపోయింది. ఒక పొద చాటునుంచి అతను హిమానీని చూశాడు. ఆమె ఒక నారింజచెట్టు కింద కూర్చుని ఫలహారం చేస్తున్నది. నారింజచెట్టు నిండా విరగ కాసిన పళ్ళున్నాయి. ఫలహారం పూర్తి చేసి ఆమె కొన్ని నారింజ

గథం చేరాడు. చిత్రమేమిటంటే, అతను అక్కడికి చేరటానికి కొంచెం ముందు గానే హీరకకుమారు డనే రత్నపురరాజ కుమారుడు అక్కడికి వచ్చి ఉన్నాడు. ఇద్దరూ రాజుగారి అతిథి భవనంలో కలుసుకున్నారు.

"మీరు ఇక్కడికి ఎలా చేరగలిగారు?" అని సముద్రసేనుడు హీరకకుమారుణ్ణి అడిగాడు.

"విమానంలో దిగాను. మా దేశంలో ఒక గొప్ప శిల్పి ఉన్నాడు. అతను నా కోసం ఒక విమానం చేశాడు. ఇరవై హంసలు అందులో నన్ను ఆకాశమార్గాన తెచ్చాయి," అన్నాడు హీరకకుమారుడు.

పళ్ళు తిన్నది. చిట్టచివరకు ఆమె చెట్టు నుంచి ఒక నారింజపండు కోసి అమృత ఫలం చెట్టు కేసి విసిరింది. వెంటనే పరిచారికలు ఆమెకు అమృతఫలం చెట్టు కింద పడక ఏర్పాటు చేశారు. హిమానీ వెళ్ళి దాని మీద పడుకున్నది. అప్పుడు హీరకకుమారుణ్ణి తెచ్చిన పరిచారిక అతన్ని తిరిగి అతిథిగృహానికి తీసుకుపోయింది.

మర్నాడు ఉదయం ఆమె వచ్చి సముద్రసేనుణ్ణి తీసుకుపోయింది. హీరక కుమారుడు చూసినదంతా సముద్ర సేనుడు కూడా చూసి తిరిగి వచ్చాడు.

రాజకుమారులిద్దరూ తాము చూసిన విషయం గురించి మాట్లాడుకున్నారు.

"రాజకుమార్తె హిమానీకి నారింజ పళ్ళు చాలా ఇష్టం అని తోస్తుంది," అన్నాడు హీరకకుమారుడు.

"అలాగే కనిపిస్తుంది," అన్నాడు. సముద్రసేనుడు.

ఇంతలో రాజకుమార్తె పరిచారిక తిరిగి వచ్చి, "రేపు ఉదయం రాజకుమార్తె మిమ్మల్ని ఒకరి తరవాత ఒకర్ని చూస్తుంది. ఆమెకు తగిన కానుక తీసుకుని మరీ వెళ్ళండి. ఆమె మీలో ఎవరిని వరించేదీ మీ రిచ్చే కానుకపైన ఆధార పడుతుందని గుర్తుంచుకోండి," అని చెప్పింది.

ఆమె వెళ్ళిపోగానే ఇద్దరు ప్రత్యర్థులూ దీర్ఘాలోచనలో పడ్డారు.





ఉదయం కాగానే పరిచారిక వచ్చి, హీరకకుమారుణ్ణి రాజకుమార్తె మందిరానికి తీసుకుపోయింది. హీరకకుమారుడు తన ఉత్తరీయం చాటున ఒక నారింజపండు దాచుకుని తీసుకుపోయి, దాన్ని హిమానీకి బహూకరించాడు. ఆమె దాన్ని ఎంతో వినయంతో స్వీకరించి, అతనితో ఆప్యాయంగా సంభాషించి, పంపేసింది. తన కోరిక ఈడేరినట్టే సంతోషిస్తూ అతను తిరిగి వచ్చాడు.

తరవాత రాజకుమార్తెను చూడబోవటం సముద్రసేనుడి వంతు. హిమానీ సమక్షానికి రాగానే అతను తన జేబులో నుంచి ఒక నారింజప[illegible] తీసి, దాన్ని బల్ల మీద ఉంచాడు. తరవాత అతను మరొక జేబులో నుంచి ఒక రుమాలు తీసి, నారింజపండును తన చేతిలోకి తీసుకుని నారింజపండు మీద రుమాలు కప్పాడు. ఒక్కక్షణం ఆగి అతను తన రుమాలు పైకి తీశాడు. అతని చేతిలో అమృతఫలం ఉండటం చూసి హిమానీ ఆశ్చర్యపోయింది. ఆమెకు అతను ఆ అమృతఫలాన్ని ఇచ్చాడు. ఆమె దాన్ని సంతోషంగా స్వీకరించింది.

"చిన్న ఇంద్రజాలం చేశాను," అన్నాడు సముద్రసేనుడు.

హిమానీ సముద్రసేనుణ్ణి వరించినట్టు ప్రకటించింది. హీరకకుమారుడు హతాశుడయాడు. అతను సెలవు పుచ్చుకొని వెళ్ళిపోతూ, "ఏదో ఇంద్రజాలం చేసి నారింజపండును అమృతఫలంగా మార్చావుట. ఎలా చేశావు?" అని సముద్రసేనుణ్ణి అడిగాడు.

"చూడు," అంటూ సముద్రసేనుడు ఒక నారింజపండు తీసుకుని, దాని తోలును అడుగు నుంచి పైకి ఆరు చోట్ల కత్తితో కోశాడు. తరవాత తోలును సగం దాకా ఒలిచి, లోపల ఉండే తొనలన్నీ తీసేసి, తోలు లోపలిభాగం తుడిచాడు. తరవాత నారింజ తొక్కలోపల ఒక అమృతఫలాన్ని పెట్టి, తొక్కను పూర్తిగా

మూసేశాడు. ఇప్పుడది చూడటానికి నారింజపండు లాగే ఉన్నది. దాన్ని తన ఎడమ చేతిలో పెట్టుకుని, కుడి చెత్తో దాని మీద రుమాలు కప్పి, రుమాలు పైకి తీసేటప్పుడు నారింజ తొక్కను కూడా లాగేశాడు. అతని చేతిలో అమృత ఫలం ఉన్నది.

"ఇంతేనా నీ ఇంద్రజాలం?" అని నవ్వి హీరకకుమారుడు తన హంసల విమానం మీద వెళ్ళిపోయాడు.

తరవాత హిమానీకీ, సముద్రసేనుడికీ వివాహం జరిగింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, రాజకుమార్తె హిమానీ గురించి నీ అభిప్రాయం ఏమిటి? ఆమె తనను వరించి వచ్చిన వాళ్ళకు పెద్ద పరీక్ష పెడతానని చెప్పి, చివరకు చిన్న ఇంద్రజాలం చేసిన వాణ్ణి ఎందుకు పెళ్ళాడింది? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల బద్దలవుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజకుమార్తె పెట్టినపరీక్ష తెలుస్తూనే ఉన్నది. ఆమె నారింజపళ్ళు తినటమూ, నారింజ పండును అమృతఫలం చెట్టు కేసి విసిరి దానికింద విశ్రమించటమూ ఇద్దరు రాజకుమారులూ చూశారు. కాని దాని అంతరార్థం హీరకకుమారుడు గ్రహించలేదు, సముద్రసేనుడు గ్రహించాడు. ఆమె జీవితం ప్రస్తుతం నారింజపండు లాగ, సారంలేని ద్రవం లాగ, ఉన్నది. తన జీవితం గుజ్జుతోకూడిన అమృతఫలం లాగా మారాలని ఆమె కోరిక. సముద్రసేనుడు అమృతఫలాన్ని తీసుకుపోయి ఇచ్చినా ఆమె అతన్ని తప్పక పెళ్ళాడేదే. కాని అతను తన ఇంద్రజాలంతో నారింజపండును అమృతఫలంగా మార్చి ఆమె భావాన్ని మరింత స్పష్టంచేశాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# బంగారు మురుగులు

ఒక ఊళ్ళో రామయ్య అనే ఆయన ఉన్నాడు. ఆయనకు అరవై యేళ్ళు నిండాయి. ఆయన కొడుకు సుబ్బారాయుడు. అతని భార్య దుర్గాంబ. దుర్గాంబకు ఆంజనేయులు అనే తమ్ముడు ఒకడు ఉన్నాడు. వీరంతా ఒకే కుటుంబంగా జీవిస్తున్నారు.

రామయ్యగారి చేతులకు నాలుగయిదు వందల విలువ చేసే బంగారు మురుగులు ఉన్నాయి. దుర్గాంబ ఎప్పుడూ వాటి వంక ఆశగా చూస్తూండేది. వాటి కోసమైనా తన కోడలు తన కింత గంజి పోస్తుంది లెమ్మని రామయ్య అనుకునే వాడు.

తండ్రి చనిపోయినాక వాటిని చెడగొట్టి, తన పెళ్ళాం ఇష్ట ప్రకారం నగలు చేయించాలని సుబ్బారాయుడు కూడా ఎదురు చూస్తున్నాడు.

ఒకనాడు రామయ్య మామూలు ప్రకారం సాయంత్రంవేళ పొలంలోని మామిడిచెట్టు కింద కూర్చుని, ఏదో ఆలోచనలో పడిపోయి చీకటి పడినదాకా ఇంటికి రావటం ఏమారాడు. చీకటి పడితే ఆయనకు బొత్తిగా చూపు ఆనదు. ఆలోచన కట్టిపెట్టి ఆయన చుట్టూ కలయజూసి కంగారు పడ్డాడు.

"ఎవరర్రా? దగ్గిరలో ఎవరన్నా ఉన్నారా?" అని ఆయన కేకపెట్టాడు, ఎవరైనా సాయంగా వచ్చి తనను ఇంటికి చేరుసారని.

కొంచెం దూరంగా పొలంలో పని చేసుకుంటున్న ఆంజనేయులు ముసలాయన పెట్టిన కేక విని, ఆయన పరిస్థితి అర్థం చేసుకుని, దగ్గిరికి వచ్చి, కొడవలి ఆయన పీకకు పెట్టి, మారు గొంతుకతో, "మురుగులు ఇచ్చెయ్యి!" అన్నాడు.

సేలా రామకృష్ణ

చేసేది లేక, రామయ్య తన మురుగులు తీసి అంజనేయులుకు ఇచ్చాడు. వాటిని తీసుకుని ఆంజనేయులు వెళ్ళిపోయాడు. తరవాత ఎలాగో రామయ్య ఇంటికి చేరాడు.

రామయ్య వద్ద నుంచి మురుగులు కాజేసిన ఆంజనేయులు కంసాలి కనకరాజు దగ్గిరికి వెళ్ళి, "నీకు సగం వాటా ఇస్తాను, ఈ బంగారం అమ్మిపెట్టు," అన్నాడు. కంసాలి సరేనన్నాడు.

పొద్దు పోయి యిల్లు చేరిన మామగారి చేతులు బోడిగా ఉండటం చూసి, దుర్గాంబ ఉండబట్టలేక, మురుగులు ఏవీ అని అడిగింది.

"నీకు నగలు చెయ్యమని కంసాలికి ఇచ్చాను," అన్నాడు రామయ్య సమయస్ఫూర్తితో. దుర్గాంబ సంతోషపడి, తమ కోసం ప్రత్యేకంగా చేసుకున్న వంటకాలు కూడా ఆ రాత్రి మామగారికి వడ్డించింది.

కనకరాజు అర్ధరాత్రి అయినా ఏదో పని చేస్తూండటం గమనించి, అతని భార్య మీనాక్షి లేచి వచ్చి, ఇంత పొద్దు పోయి ఏం చేస్తున్నావని అడిగింది.

భార్యను చూసి కంగారుపడి కనకరాజు చెయ్యి కాల్చుకుని, పోయి పడుకోమని ఆమెను కసిరాడు. ఆమెకు అనుమానం వేసింది, అయినా వెళ్ళి పడుకున్నది.




దుర్గాంబ కోడికూయక ముందే లేచి కంసాలి కనకరాజు ఇంటికి పరుగు తీసింది. కనకరాజు ఇంట్లో లేడు, కాలవ గట్టుకు వెళ్ళాడు.

"మా మామగారు బంగారు మురుగులు చెడగొట్టి నాకు నగలు చెయ్యమని ఇచ్చారట. నాకు ఫలానా ఫలానా నగలు కావాలి. మీ అయన రాగానే ఒకసారి వచ్చి, నాతో మాట్లాడమని చెప్పు," అని మీనాక్షికి చెప్పి, దుర్గాంబ ఇంటికి తిరిగి వచ్చింది.

కనకరాజు ఇంటికి రాగానే మీనాక్షి అతనితో దుర్గాంబ చెప్పమన్నట్టు చెప్పింది. అతను మొదట ఆశ్చర్యపడి,



"ఆ సరుకు వారిది కాదులే," అని తన భార్యకు నచ్చచెప్పాడు.

తాను కంసాలి ఇంటికి వెళ్ళి వచ్చిన సంగతి ఇంట్లో అందరి ముందూ దుర్గాంబ చెప్పింది. ఆమె మాటలు విని అంజనేయులూ, రామయ్యా కూడా ఎంతగానో ఆశ్చర్యపోయారు. కాని ఇద్దరూ బయటపడలేదు.

ఆ తరవాత వీలు చూసుకుని అంజనేయులు కంసాలి వద్దకు వెళ్ళి, మురుగుల ప్రసక్తి తెచ్చాడు. గుడినీ, గుళ్ళో లింగాన్నీ కూడా మింగ గల కనకరాజు, "ఏం మురుగులు? నువు నా కేమీ ఇయ్యలేదు. కావలిస్తే న్యాయస్థానానికి వెళ్ళు," అన్నాడు. అప్పటికి అతనికి ఆ మురుగులు రామయ్య వన్న సంగతి కూడా తెలిసింది.

ఈ మాటకు అంజనేయులు తెల్లబోయి, తాను దొంగ అన్న సంగతి రుజువు చేసుకోలేక, చేసిన దానికి పశ్చాత్తాపపడుతూ, ఇంటి దారి పట్టాడు.

రామయ్య మాత్రం రహస్యంగా తన కొడుకుతో, తన మురుగులు క్రితం సాయంకాలం ఎవరో బలాత్కారంగా తీసుకున్నారనీ, చూపు అనక తాను ఆ మనిషిని గుర్తుపట్టలేక పోయినాననీ చెప్పాడు.

ఈ మాట చెవిని పడిన అనంతరం సుబ్బారాయుడు, తన బావమరిది అంజనేయులు కంసాలి ఇంటికి వెళ్ళి రావటం ఒక కంట కనిపెట్టాడు.

అంజనేయులు వచ్చి కనకరాజుతో మాట్లాడేటప్పుడు తలుపు చాటున పొంచి ఉండి, కనకరాజు భార్య మీనాక్షి అంతా విని, సంగతి గ్రహించింది. పుట్టింటి వారు మీనాక్షికి ఏమీ పెట్టలేదని కనకరాజు ఎప్పుడూ సాధించే వాడు. ఆ సాధింపులు వినలేక పోయేది మీనాక్షి. కిందటి రాత్రి తన భర్త కరిగించిన బంగారం తాను కాజేసి, తన పుట్టింటి వారికిచ్చి నగలు చేయించి తెచ్చుకుంటే తన భర్త

సాధింపులు కట్టుపడతాయని ఆమె అనుకున్నది. భర్త అలా బయటికి వెళ్ళగానే మీనాక్షి బంగారం సంగ్రహించి తన బొడ్డులో దాచుకున్నది.

బయటి పని ముగించుకుని ఇంటికి తిరిగి వచ్చి, కనకరాజు, బంగారం కనపడక పోయేసరికి, తన పెళ్ళాం మీద ఎగిరిపడ్డాడు. తనకు దాని ఊసే తెలియదని ప్రమాణాలు చేసింది మీనాక్షి.

కనకరాజు తనకు చేసిన మోసానికి, అతన్ని చంపి కసి తీర్చుకోవాలని ఆంజనేయులు అర్ధరాత్రివేళ కనకరాజు ఇంటికి వచ్చి, ఇంటి బయట గల చెట్లలో ఒకదాని చాటున పొంచి, అవకాశం కోసం చూస్తూ నిలబడ్డాడు.

మురుగుల విషయంలో ఆంజనేయులుకూ, కనకరాజుకూ ఏదో సంబంధం ఉందని అనుమానించిన సుబ్బారాయుడు, ఆంజనేయులును వెయ్యి కళ్ళతో కనిపెడుతూ ఉండి, అతని వెనకనే తాను కూడా వచ్చి, ఒక పొద చాటున దాగి ఆంజనేయులు మీదనే దృష్టి ఉంచాడు.

ఇంట్లో ఉన్న బంగారం ఇంట్లోనే మాయమయిందంటే అది భార్య పనే అనుకుని, నిద్రపోతున్నట్టు నటించి, పెళ్ళాన్ని కనిపెట్టసాగాడు కనకరాజు.

బంగారం తన వద్దనే ఉండటం మంచిది కాదనుకుని మీనాక్షి చెంబుతో నీళ్ళు పట్టుకుని, చల్లగా ఇంటి నుంచి



బయటికి వచ్చి, ఊరు చివరకు బయలు దేరింది. దొంగనిద్ర నటిస్తున్న కనక రాజు ఆమె వెనకనే బయలుదేరాడు.

వాళ్ళిద్దరినీ చూసి, వాళ్ళు ఎక్కడికి పోతున్నదీ అర్థంగాక, ఆంజనేయులు కనకరాజు వెనకగా తాను కూడా బయలు దేరాడు. ఆంజనేయులు వెనకగా సుబ్బా రాయుడు కూడా బయలుదేరాడు.

ఈ నలుగురిలో ఎవరికీ తమ వెనక ఎవరో వస్తున్న సంగతి తెలియదు. మీనాక్షి తాను ఒంటరిగా పోతున్నాననే అనుకున్నది. కనకరాజు తన భార్యను తాను ఒక్కడే అనుసరిస్తున్నా నను కున్నాడు. అలాగే ఆంజనేయులుకు తన ముందున్న ఇద్దరూ తెలుసుగాని, తన వెనక వస్తున్న సుబ్బారాయుడి సంగతి తెలీదు.

ఈ నలుగురూ పిల్లుల లాగా ఒకరి వెనకగా ఒకరు పోతూండటం వీధిలో అరుగు మీద నిద్రపోతున్నట్టు పడుకుని ఉన్న ఒక వ్యక్తి గమనించి, సుబ్బా రాయుడి వెనకగా ఎవరూ లేకపోవటం చూసి, తాను అతని వెంట బయలుదేరాడు.

మీనాక్షి ఊరి చివర పాడుబడ్డ దేవా లయం దగ్గిర ఆగి, అక్కడ చిన్న గుంటలో బంగారం ఉంచి, దాని మీద ఇంత మట్టి కప్పి, ఇంటికి వెళ్ళిపోయింది. వెంటనే మిగిలిన ముగ్గురూ ఆ గుంట మీదికి ఒక్కసారిగా దూకి, దాని కోసం తన్నుకోసాగారు.

ఇంతలో, "ఆగండి!" అని వెనక వచ్చిన మనిషి గట్టిగా గర్జించాడు.

ముగ్గురూ వెనక్కి తిరిగిచూసి, ఆ కేక పెట్టినది ఆ ఊరి రాజు అని గ్రహించి, ఆయన కాళ్ళమీద పడ్డారు. రాజు వాళ్ళ కథ అంతా విని, బంగారాన్ని దొంగిలించి నందుకు ఆంజనేయులునూ, తోడు దొంగ అయి, నమ్మక ద్రోహం చేసినందుకు కనకరాజునూ శిక్షించి, బంగారాన్ని రామయ్యకు తిరిగి ఇప్పించాడు. కాల క్రమాన దుర్గాంబ ఆ బంగారంతో నగలు చేయించుకున్నది.






# అతివాగుడు

ఒక ఊళ్ళో ఒక ధనికుడికి గౌరి అని కూతురు ఉండేది. ఆమె చాలా అందమైనదీ, చురుకైనదీనూ. ఆమెలో ఉన్న దుర్గుణం ఏమిటంటే, మాట్లాడకుండా ఒక్క క్షణమైనా ఉండలేదు. అతి వాగుడు అనర్థదాయక మని తల్లి ఎంత చెప్పినా, గౌరి తల కెక్కలేదు. ఆమె ఉద్దేశంలో ఎక్కువగా మాట్లాడటం ఒక గొప్ప కళ, చెడ్డ అలవాటు కానేకాదు.

పెళ్ళిచేసుకుని, భర్త వెంట వెళ్ళి పోయిన తరవాత కూడా ఆమె తన అలవాటు మానుకునే అవసరం కలగ లేదు. ఎందుకంటే, ఆమె పొరుగున ఆమె వంటి వారే మరి నలుగురు ఉన్నారు. గౌరి భర్తలాగే వారి భర్తలు కూడా రాజుగారి కొలువులో ఉద్యోగాలు చేస్తున్నారు. వాళ్ళు వెళ్ళగానే ఆడవాళ్లందరూ చేరి కబుర్లు మొదలుపెట్టేవారు.

గౌరికి పొరుగున శారద అనే ఆమె ఉండేది. ఆమె ఈ జట్టులో కలిసేది కాదు. అందుచేత ఈ అయిదుగురికీ శారదను చూస్తే తేలిక భావం ఉండేది: ఆమెను గురించి వాళ్ళు వీలయినంత తక్కువచేసి మాట్లాడుకునే వారు.

ఒకసారి అయిదుగురు ఆడవాళ్ళూ మాట్లాడు కుంటూ ఉండగా గౌరి కళ్ళు తిరిగి పడిపోయింది. మిగిలిన నలుగురూ కంగారు పడిపోయి, ఏం చెయ్యాలో తెలీక వీధిలోకి వచ్చారు. ఆ సమయంలో అటుగా వెళుతున్న శారద వాళ్ళ ముఖాలను బట్టి ఏదో జరిగిందని గ్రహించింది. ఆమె అడిగిన మీదట వాళ్ళు గౌరి సంగతి చెప్పారు. శారద లోపలికి వెళ్ళి, గౌరి ముఖాన నీళ్ళు చల్లి స్పృహ తెప్పించి, నాడి చూసి నవ్వుతూ, "నువు తల్లివి కాబోతున్నావు.

"వసుంధర"




కొంచెం జాగ్రత్తగా ఉండు,'' అని చెప్పి వెళ్ళిపోయింది.

శారద చెప్పినది నిజమే అయింది. గౌరి గర్భిణిగా ఉండి పుట్టింటికి పోయి, పండంటి కొడుకును ఎత్తుకుని తిరిగి వచ్చింది. వస్తూనే ఆమె తనకు తెలిసిన వారందరినీ పిలిచి విందు చేసింది. అందరూ ఏవేవో బహుమతులు తెచ్చారు. అన్ని బహుమతులకన్న శారద తెచ్చిన బహుమానం గౌరిని ఎక్కువ ఆకర్షించింది. శారద తన కొడుక్కు సరిపోయే ఉన్ని దుస్తులు తెచ్చింది. వాటిని శారద స్వయంగా తయారు చేసిందని తెలిసి గౌరి ఆశ్చర్యపోయింది.

మర్నాడు గౌరి మిగిలిన ఆడవాళ్ళతో ఈ మాట చెప్పినప్పుడు వాళ్ళు, ''ఉన్ని దుస్తులు అల్లటం బ్రహ్మవిద్య ఏమీ కాదు. మనం అల్లినవి కొన్నవాటంత అందంగా ఉండవు. డబ్బు కక్కుర్తికొద్దీ ఆ శారద చాలా పనులు తానే చేసుకుంటుంది. ఏం చేస్తుంది, పాపం? మనలా డబ్బున్నదికాదు!'' అని తేల్చారు.

శారద పొదుపరి అన్న సంగతి గౌరి గుర్తించింది. ఆమె పాడి చేస్తుంది; పిడకలు తయారు చేస్తుంది; దొడ్లో కూరలు పండించి, ఎక్కువగా ఉన్నప్పుడు గౌరిలాటి ఇరుగుపొరుగు వాళ్ళకు ఇస్తుంది; తన భర్తకు అంగీలూ, తనకు రవికలూ కుట్టుకుంటుంది; చిన్న చిన్న రోగాలకు స్వయంగా వైద్యం చేసుకుంటుంది.

ఇలా ఉండగా గౌరికి ఆమె భర్త ఒక రహస్యం చెప్పాడు. రాజుగారి పైన హత్యా ప్రయత్నం జరిగింది. ఈ పరమ రహస్యం తనకు తెలిసినందుకు గర్వపడుతూ గౌరి భర్త, దాన్ని ఎవరికీ చెప్పవద్దని భార్యను హెచ్చరించాడు.

అయితే ఈ రహస్యం గౌరి నోట రెండు రోజుల పైన దాగలేదు. మూడో నాడు ఆమె ఈ రహస్యాన్ని తన స్నేహితురాళ్ళకు చెప్పి, దాన్ని మరెవరికీ చెప్పవద్దని కోరింది. అదే షరతు మీద వాళ్లు

మరికొంత మందికి ఆ రహస్యాన్ని చెప్పేశారు. నాలుగు రోజులు తిరగకుండానే ఆ రహస్యం నగరమంతా పాకిపోయింది.

అయిదో రోజు రాజభటులు గౌరి భర్తను తీసుకుపోయి కారాగృహంలో పెట్టారు. గౌరి లబోదిబో మంటూ ఏడ్చింది. అందువల్ల ప్రయోజనం లేకపోయింది. ఆమె భర్త రాజుగారి ఆగ్రహానికి పాత్రుడయే సరికి అందరూ ఆమెను చూడరావటానికే భయపడ్డారు. అయితే, ఈ సంగతి తెలియగానే శారద గౌరిని చూడవచ్చి, తాను చేతనైన సహాయం చేస్తానని హామీ ఇచ్చి, గౌరికి కాస్త ధైర్యం ఇచ్చింది.

ఆమె తన యింటికి వెళ్ళి, తన భర్తతో జరిగినదంతా చెప్పి, గౌరి భర్తను కాపాడేటందుకు ఒక మార్గం కూడా సూచించింది. శారద భర్త రాజును చూడబోయాడు. రాజు తన రహస్యం బయటపడినందుకు చాలా కోపంగా ఉన్నాడు. అందుచేత ఆయన గౌరి భర్తను రాజద్రోహిగా పరిగణించి, అతనికి మరణశిక్షగాని, దేశబహిష్కరణగాని విధించే ఉద్దేశంతో ఉన్నాడు.

శారద భర్తను చూడగానే రాజు, "ఏమిటి పని?" అని చిరాకుగా అడిగాడు.



"మహారాజా, ఒక దొంగ కేవలమూ డబ్బు కోసమే ఒక యింట దొంగతనం చేశాడనుకోండి. వాడు దొంగిలించిన సంచీలో డబ్బు మాత్రమే ఉంటే వాడు మామూలు దొంగ అవుతాడు; అందులో రహస్య రాజకీయపత్రాలు కూడా ఉంటే రాజద్రోహి అవుతాడు. నిజం ఎలా తెలుసుకోవడం?" అని శారద భర్త అడిగాడు.

"ఈ మాట ఎందుకు చెబుతున్నావు?" అని రాజు అడిగాడు.

"మీరు రాజద్రోహి అనుకునే వ్యక్తి నిజంగా రాజద్రోహి కాదు. అతను తన భార్యను నమ్మి రహస్యం చెప్పాడు.

ఆమెకు అతిగా మాట్లాడే అలవాటు ఉండడం వల్ల ఆ రహస్యాన్ని దాచలేక పోయింది.'' అన్నాడు శారద భర్త.

''నేను నమ్మను. ఎంత అతిగా మాట్లాడే వారయినా రహస్యాన్ని దాచ లేకపోరు,'' అన్నాడు రాజు.

''తమరు మన్నించే టట్టుంటే సాహ సించి ఒక సూచన చేస్తాను. మహారాణీ గారికి ఏదన్నా రహస్యం చెప్పి చూడండి. మీరు పరీక్ష చేస్తున్నట్టు ఎవరికీ తెలియ నివ్వక, నాలుగు రోజులు వేచిచూడండి," అన్నాడు శారద భర్త.

అతని మాటల్లో కొంత సబబు ఉన్నట్టు తోచి రాజు అతను చెప్పినట్టే చేశాడు. మహారాణికి కూడా అతిగా వాగే దురల వాటున్న సంగతి అందరికీ తెలుసు. రాజు ఆమెకు చెప్పిన రహస్యం దాగలేదు.

రాజు తన తప్పు గుర్తించి, గౌరి భర్తను చెరవిడిపిస్తూ, భార్య విషయంలో జాగ్రత్తగా ఉండమని హెచ్చరించాడు. అంతేగాక, అతివాగుడు వల్ల కలిగే అనర్థాలను గురించి శిలాశాసనాలు దేశ మంతటా వేయించాడు.

తన భర్తకు విముక్తి కలిగాక గౌరి శారదకు ఎన్నో విధాలుగా కృతజ్ఞత చెప్పుకుని, ''నువు నాకు ఎన్నో ఉపకా రాలు చేసినా కూడా, మేం నిన్ను గురించి నిందా పూర్వకంగా మాట్లాడు కోవటం మానలేదు, ఎందువల్ల నంటావు?'' అని అడిగింది.

''అతిగా మాట్లాడటమే అందుకు కారణం. మాట్లాడటానికి ఏదో విషయం కావాలి గద. ఏదీ దొరక్కపోతే, తెలిసిన వాళ్ళను గురించి చెడ్డగా మాట్లాడు కోవడం మొదలు పెడతారు. అందువల్ల అకారణంగా ద్వేషాలు పెరుగుతాయి,'' అన్నది శారద.

గౌరికి జ్ఞానోదయమయింది. ఎక్కు వగా మాట్లాడక పోవడం వల్లనే శారద ఎన్నో విద్యలలో ఆరితేరిందని గ్రహించి ఆమె, తన అతివాగుడు కట్టిపెట్టి, శారద దగ్గిర ఎన్నో విద్యలు నేర్చుకున్నది.





# ప్రతిక్రియ

ఒక ఊళ్ళో భుజంగరాయుడు అనే ధనికుడు ఉండేవాడు. అతను మహాదుష్టుడు. ఆ గ్రామంలోనే పుల్లయ్య అనే రైతు నివసించేవాడు. పుల్లయ్యకు తండ్రి రెండెకరాల భూమి ఇచ్చి పోయాడు. పుల్లయ్య ఆ భూమిని సాగుచేసుకుంటూ, ఒక చిన్న వ్యాపారం కూడా చేసుకోవాలనుకున్నాడు. అందుకు డబ్బు కావాలి గనక పుల్లయ్య భుజంగాన్ని అప్పు అడిగాడు. పుల్లయ్య భూమి తాకట్టుపెట్టుకుని భుజంగం డబ్బు ఇచ్చాడు.

పుల్లయ్య అనేక కష్టాలు పడి, పొట్ట కట్టుకుని, ఏదో విధంగా భుజంగం అప్పులో సగం డబ్బు సంపాదించి, ఆ డబ్బు చెల్లు వేసుకుంటే మిగతాది నింపాదిగా ఇస్తానన్నాడు. అందుకు భుజంగం ఒప్పుకోక, బాకీ అంతా ఒక్కసారే చెల్లు వెయ్యమన్నాడు. చేసేది లేక, పులయ్య ఆ డబ్బును తిరిగి ఇంటికి తీసుకుపోయి దాచిపెట్టి, మిగతా డబ్బుకూడా పోగు చెయ్యటానికి మరింతగా శ్రమపడసాగాడు.

ఒకనాడు, పుల్లయ్య వ్యాపారం నిమిత్తం పొరుగూరు వెళ్ళి ఉన్న సమయంలో, పుల్లయ్య ఇంటికి ఎవరో గురువుట భార్యాసమేతంగా వచ్చాడు. పుల్లయ్య భార్య వాళ్ళకు ఎంతో ఆదరం చూపింది. వాళ్లు పుల్లయ్య కుటుంబానికి గల కష్టసుఖాలన్నీ తెలిసినట్టుగా మాట్లాడేసరికి, పుల్లయ్య భార్య, "నిజమే, స్వామీ, మా కష్టాలన్నీ మీకు తెలుసు గనక వాటి నుంచి బయటపడే మార్గం చూపించండి," అని గురువును వేడుకున్నది.

అందుకు గురువు సమ్మతించి, పుల్లయ్య భార్య కళ్ళకు పట్టీకట్టి, ఏదో మంత్రం చదివాడు. చాలాసేపు అయాక ఆ పట్టీ తీసి, "ఈ పట్టీ నలభైరోజుల

కే. ఎం. డి. ఫిదాహుసేన్




బాకీ తీర్చమనీ, వడ్డీయే అసలుకు సమానం అవుతున్నదనీ తొందర చెయ్యా సాగాడు. బాకీ తీర్చగలనన్న నమ్మకం పుల్లయ్యకు లేకుండా పోయింది. అతను తన ప్రస్తుత పరిస్థితి అంతా భుజంగానికి చెప్పాడు.

"అలా అయితే ఒక పని చెయ్యి. మనం జూదం ఆడదాం. గెలిచావా, నీ బాకీ తీరిపోతుంది. పోతే ఎటూ గానీ నీ డబ్బు పోతుంది," అన్నాడు భుజంగం.

ఎవరేం చెప్పినా చేసేస్థితిలో ఉన్న పుల్లయ్య సరేనన్నాడు. ఇద్దరూ జూదం ఆడారు. పుల్లయ్య ఆటలో ఓడి, తన బాకీ రద్దు కాకపోగా, తన దగ్గిర ఉన్న దంతా పోగొట్టుకున్నాడు.

ఇంక చేసేది ఏమీలేక పుల్లయ్య తన పొలాన్ని భుజంగానికే వదిలేసి, బతుకు తెరువు చూసుకోవటానికి భార్యతోసహా వేరే ఊరు బయలుదేరాడు. ఆ సమయంలో పుల్లయ్యకు భార్య, గురువు వచ్చి తన కళ్ళకు పట్టీకట్టిన సంగతి చెప్పింది. అప్పుడే తన ఇంట దొగతనం జరిగి ఉంటుంది. ఇది భుజంగం పనే అని పుల్లయ్య రూఢి చేసుకున్నాడు. కాని ఇప్పుడు తాను చేయగలది ఏమీ లేదు. భుజంగం ఇలాటి కుయుక్తులతో ఎంతో మంది రైతుల పొలాలు కాజేశాడు.

పాటు రాత్రులప్పుడు కట్టుకుని పడుకుంటె, భూమిలో ఉన్న ధనరాసులన్నీ కనిపిస్తాయి," అని ఆయన వెళ్ళిపోయాడు.

తరవాత చాలా రోజులకు పుల్లయ్య భుజంగానికి ఇవ్వవలసిన మిగతా డబ్బు కూడా పోగుచేసి, తాను ముందు దాచి ఉంచిన డబ్బు కోసం చూస్తే అది కనబడ లేదు. అతను భార్యను దబాయించాడు. ఆమె నివ్వెరపోయింది. ఇంట్లో దాచుకున్న సొమ్ము ఎలా పోయినదీ ఇద్దరికీ అర్థం కాలేదు.

పుండు మీద కారం చల్లినట్టుగా ఈ సమయానికే భుజంగం పుల్లయ్యను

తాను చేరిన ఊరిలోనే ఒక షావుకారు వద్ద పుల్లయ్యకు పని దొరికింది. పుల్లయ్య పనిలో చేరిన కొద్ది రోజులకు షావుకారు తన పొలంలో బావి తవ్వించటం ప్రారంభించాడు. అందుకు ఒక కూలీల జట్టును మాట్లాడుకున్నాడు. ఆ జట్టుకు పెద్ద సూరయ్య అనేవాడు. తవ్వకం జరిగే చోట పుల్లయ్య కూడా ఉండేవాడు.

ఒకనాడు పని జరుగుతూండగా సూరయ్య తాను తవ్వటం అకస్మాత్తుగా మానేసి, కూలీలందరినీ పని మానమని, "ఈ దినానికి ఇంతే పని," అని అందరితో సహా తానుకూడా వెళ్ళిపోయాడు. ఇదంతా పుల్లయ్య కనిపెట్టుతూనే ఉన్నాడు. సూరయ్య పలుగుకు ఏదో ఖంగుమని తగిలిందనీ, అది ఇతర కూలీలు గమనించలేదనీ, ఆ కారణం చేతనే సూరయ్య అంధరినీ పని మాన్పించాడనీ పుల్లయ్య ఊహించాడు.

చీకటి పడగానే పుల్లయ్య భయంకరమైన వేషం వేసుకుని, బావి తవ్వే స్థలానికి సమీపంలో ఉన్న ఒక చెట్టు చాటున దాక్కున్నాడు. కొంత రాత్రి గడిచిన మీదట, పుల్లయ్య అనుమానించినట్టే, సూరయ్య బావి తవ్వే చోటికి వచ్చాడు. అకస్మాత్తుగా పుల్లయ్య చెట్టు చాటునుంచి భయంకరాకారం తన




ఎదటికి వచ్చే సరికి, సూరయ్య భయంతో వణికిపోయాడు.

"నరుడా, నీవు నా ధనము తీసుకోవటానికి వచ్చావు. నాకు బలి ఇయ్యక నువు దాన్ని ముట్టలేవు. వెళ్ళు! మూడు గొర్రె పొటేళ్ళనూ, మూళు కోళ్ళనూ తీసుకురా," అని పుల్లయ్య రంకెలు పెట్టాడు.

"అలాగే, స్వామీ!" అంటూ సూరయ్య అక్కడి నుంచి పరిగెత్తిపోయాడు.

సూరయ్య కనుమరుగు కాగానే పుల్లయ్య తనవేషం తీసివేసి, షావుకారు ఇంటికి వెళ్ళి, సంగతంతా చెప్పి, అయ



నను వెంటబెట్టుకుని బావి తవ్వే చోటికి వచ్చాడు. సూరయ్య తవ్వుతూ తవ్వుతూ పని నిలిపినచోట పుల్లయ్య తవ్వేసరికి ఒక హండా బయట పడింది. దాని నిండా వెండి బంగారాలూ, మణి మాణిక్యాలూ ఉన్నాయి.

ఇద్దరూ కలిసి అతి కష్టం మీద ఆ హండాను పైకి తీసి, షావుకారు ఇంటికి చేరవేశారు. షావుకారు పుల్లయ్య చేసిన మేలుకు కృతజ్ఞతగా ఏం కావాలో కోరుకో మన్నాడు.

''మీ సొత్తు మీకు దక్కింది, అంతే చాలు. నా సొత్తు మావూరి భుజంగం కాజేశాడు,'' అంటూ పుల్లయ్య తనకు జరిగిన అన్యాయమంతా షావుకారుకు చెప్పాడు.

షావుకారు కొంచెం ఆలోచించి, ''మీ భుజంగంగానికి ప్రతిక్రియ చేద్దాం,'' అన్నాడు.

తరవాత కొద్ది రోజులకు భుజంగం ఉండే వీధిలోకి ఒక ధనికుడు కొత్తగా దిగి, ఒక మేడ అద్దెకు తీసుకున్నాడు. ఒకనాడు ఆ ధనికుడి నౌకరు ఒకడు భుజంగం వద్దకు వచ్చి, నాలుగు బంగారు నాణాలకు చిల్లర ఇయ్యమని అడిగాడు.

వాటిని చూడగానే భుజంగం కళ్ళు జిగేలుమన్నాయి. ''ఇవి ఎక్కడివిరా నీకు ?'' అని అడిగాడు.

''మా షావుకారువి, దొరా. వారికి చిల్లర కావాలిట!'' అన్నాడు నౌకరు. తరవాత వాడు భుజంగంతో రహస్యంగా, అట్లాంటివి తన యజమాని దగ్గిర చాలా ఉన్నాయని చెప్పాడు.

ఈ సంగతి విన్న మీదట భుజంగానికి ఆ ధనికుడి స్నేహం చేసుకోవాలని బుద్ధి పుట్టింది. అతను ధనికుడి పరిచయం సంపాదించి, స్నేహపూర్వకంగా అతని పూర్వోత్తరాలు రాబట్టాడు. ఆ ధనికుడి వద్ద ఉన్నడబ్బంతా అతని సొంతం కాదు.

''ఇది పరమరహస్యం. మా తండ్రి రాజాస్థాన శిల్పి. ఆయన రాజుగారి

ధనాగారానికి ఒక రహస్య ద్వారం తెలుసుకుని, నాకు చెప్పాడు. ఆ ధనం కొంత సంగ్రహించి నేను ఇక్కడికి వచ్చేశాను." అన్నాడు ధనికుడు భుజంగంతో.

"మీరు అక్కడే ఎందుకు ఉండలేదు?" అని భుజంగం అడిగాడు.

"అక్కడే ఉంటే మళ్ళీ మళ్ళీ ధనాగారం నుండి ధనం తీసుకురావాలని నాకు దుర్బుద్ధి కలగవచ్చు. దురాశ దుఃఖం చేటు. నేను ఎప్పుడో ఒకప్పుడు పట్టుబడవచ్చు కూడా. ఈ తెచ్చిన డబ్బుతో ఇక్కడ ఒక కర్మాగారం నెలకొల్పి, సుఖంగా జీవింతామనుకున్నాను." అని చెప్పి, ఆ ధనికుడు తాను తెచ్చిన ధనాన్ని భుజంగానికి చూపించాడు. అది చూసిన మీదట భుజంగానికి ధనికుడి మాటలలో గట్టి నమ్మకం ఏర్పడింది. అలాంటి నిధి రాజుల వద్ద తప్ప మరెక్కడా ఉండదు.

భుజంగం ఆ ధనికుడితో స్నేహం మరింత పెంచుకుని, ఒకనాడు అతనితో, "ఆ రాజుగారి ధనాగారం నుంచి నేను కూడా ధనం తెచ్చుకునే భాగ్యం ఒక్కసారి కలిగించకూడదా? మీ మేలు ఎన్నటికీ మరవను," అన్నాడు.

"అబ్బో, దానికి చాలా కట్టు దిట్టాలున్నాయి. మా నాయనతో ఏం చెప్పేది?



కాని నువు ఒక పని చెయ్యవచ్చు. మేము ఇక్కడ ఒక పంచదార కర్మాగారం నెలకొల్పుదా మనుకుంటున్నాం. దానికి నూరు ఎకరాల చెరుకు పంట కావాలి. నువు మా పేరిట నూరు ఎకరాలు రాసియిస్తే, మా నాన్నను ఒప్పించి నీకు రహస్యం చెప్పగలను," అన్నాడు ధనికుడు.

భుజంగం, "సరే లెండి. ఎవరు మాత్రం భృతిలేనిదే పనిచేస్తారా?" అని, మర్నాడు ఆ ధనికుడి పేర నూరు ఎకరాల పొలం రాసిన పత్రం తీసుకు వచ్చాడు. ఇద్దరూ రహస్యంగా ఒక గదిలో చేరి మాట్లాడుకో సాగారు. ధని

కుడు భుజంగం రాసి ఇచ్చిన పత్రం తీసుకుని పరిశీలిస్తున్నాడు.

ఆ సమయంలో తలవని తలంపుగా ఒక ప్రభుత్వోద్యోగి ప్రత్యక్షమయాడు. అతన్ని చూడగానే ధనికుడు తాను చూస్తున్న పత్రాన్ని చప్పున జేబులో దాచుకున్నాడు.

ఆ అధికారి ధనికుడితో, "నీ రహస్యం తెలిసి పోయింది. పద, రాజుగారి దగ్గిరికి. నిన్ను రాజుగారు ఉరికంబం ఎక్కించబోతున్నాడు," అని, గుడ్లు అప్పగించి చూస్తున్న భుజంగాన్ని చూసి, "వీడెవడు? నీ తోడు దొంగా? వీణ్ణి కూడా నీ వెంట తీసుకురా!" అన్నాడు.

"అతను, పాపం, ఏమీ ఎరగడు. చుట్టపు చూపుగా వచ్చిన పెద్ద మనిషి," అంటూ ధనికుడు అధికారితో ఏమేమిటో చెప్పతూండగా భుజంగం చల్లగా జారుకున్నాడు.

మర్నాడే, భుజంగానికి తమ పొలాలు ధారపోసిన రైతులందరూ ఎప్పటిలాగే పొలాలు చేసుకుంటూ కనిపించారు. అతడు వాళ్లను, "ఏమిటిరా మీ దౌర్జన్యం? ముందు బయిటికిపొండి. నా బాకీలు తీర్చకుండానే పొలాలలోకి ఎవరి నడిగి దిగారు?" అని అడిగాడు.

వాళ్ళంతా ఏకమై, "ముందు నువు ఇక్కడి నుంచి పో లేకపోతే నీ మర్యాద దక్కదు. తరవాత విచారిస్తావు," అన్నారు భుజంగంతో.

భుజంగం నివ్వెరపోయి, తాను రాసిన పత్రం గురించి వాళ్ళకు అప్పుడే తెలిసి ఉంటుందా అని ఆశ్చర్యపోయాడు.

పుల్లయ్య ముందుకు వచ్చి ఒక పత్రం చూపించి, "మా పొలాలపై నీ కున్న హక్కు ఇందులో వదులుకున్నావు, జ్ఞాపకం లేదా?" అని అడిగాడు.

పుల్లయ్య తన యజమాని అయిన షావుకారు సహాయంతో నాటకం ఆడి, తన పొలమే గాక, ఊళ్లో ఇతర రైతుల పొలాలు కూడా ఎవరివి వాళ్ళకు తిరిగి వచ్చేటట్టు చేశాడు.



# యోగి - కర్మయోగి

ఒక కర్షకుడు రాత్రిపూట పొలం నుండి వస్తూ, ఒక చెట్టు కింద తపస్సు చేసుకుంటున్న ఒక ముని పాదం చూడక తొక్కాడు. వాడి కాలి గోరు తగిలి ముని పాదం గాయం అయింది.

ముని ఆగ్రహంతో కళ్ళు తెరిచి, "పాపీ, నన్ను గాయపరిచిన నీ రెండు కాళ్ళూ పడిపోవుగాక!" అని శాపం పెట్టాడు. అయితే ఆ శాపం కర్షకుడికి తగలలేదు. వాడు మునికి క్షమాపణ చెప్పుకుని, చక్కగా నడిచి ఇంటికి వెళ్ళిపోయాడు.

తాను చేసిన తపస్సంతా వ్యర్థమయిందని ముని, శ్వాస స్తంభించి ఆత్మహత్య చేసుకోబోయాడు.

అప్పుడు చెట్టును ఆశ్రయించి ఉన్న దేవత ప్రత్యక్షమై, అతన్ని వారించి, "నువు ఎందుకు తపస్సు చేస్తున్నావు?" అని అడిగింది.

"నా ముక్తి కోసం!" అన్నాడు ముని.

"మూర్ఖుడా, నువు నీ కోసం తపస్సు చేసుకుంటున్నావు. ఆ కర్షకుడు తన కుటుంబం కోసం శ్రమిస్తున్నాడు. నువు యోగివైతే, వాడు కర్మయోగి. ఇతరుల మేలు కోసం బతుకుతున్నాడు. నీ శాపం వాడికి తగలదు," అన్నది వృక్షదేవత.

అంతటితో మునికి జ్ఞానోదయమయింది. —అరజా విష్ణుమూర్తి.





# బ్రతికిచెడ్డవాడు

ఒకప్పుడు వెంకటాపురంలో శేషాచార్యులు అనే కవి ఉండేవాడు. ఒకసారి ఆయన దూరగ్రామానికి వెళ్ళి, అక్కడ వ్యవహారం చక్కబెట్టుకుని, తిరుగు ప్రయాణమయాడు. ప్రయాణానికిగాను రంగయ్య అనే బండివాడు అయిదు వరహాల కిరాయికి బండి కట్టాడు.

దారిలో రంగయ్య శేషాచార్యులును, ''అయ్యా, మీది వెంకటాపురమేనా?'' అని అడిగాడు.

ఏదో ఆలోచనలో ఉన్న శేషాచార్యులు తల ఎత్తి, ''మాది అసలు సిద్ధాపురం. మా తండ్రిగారి హయంలో వెంకటాపురం వచ్చేశాం,'' అన్నాడు.

''అంటే, మీ పూర్వీకులది సిద్ధాపురమా?'' అన్నాడు రంగయ్య ఎంతో ఆశ్చర్యపడుతూ.

''ఏం ఆశ్చర్యపోతున్నావు? ఆ ఊళ్ళో నీకు తెలిసిన బంధువులు ఉన్నారా?'' అని శేషాచార్యులు అడిగాడు.

రంగయ్య కొంచెం బాధపడుతున్నట్టు కనబడి, ''ఒకప్పుడు ఉండేవారు లెండి. వాళ్ళు కూడా పొట్టలు చేత పుచ్చుకుని తలా ఒకదిక్కు వెళ్ళిపోయారు. అది సరే, మీరు ఏం చేస్తూ ఉంటారు?'' అన్నాడు.

''కవిత్వం చెబుతాను. కొద్దిపాటి కావ్యాలు రాశాను,'' అన్నాడు శేషాచార్యులు.

రంగయ్య సంబరపడి పోయి, ''మీరు కవులా! చెప్పరేం? నాకు కవులంటే చాలా అభిమానం. మీలాటి కవిని బండిలో తీసుకు పోతున్నందుకు నాకెంతో గర్వంగా ఉన్నది. మీ తండ్రి తాతలు కూడా కవులేనాండి?'' అని అడిగాడు.

కె. సుమిత్ర

బండివాడి మాటలకు శేషాచార్యులు నవ్వి, "వాళ్ళ రక్తంలో కవిత్వం పొంగులు పారింది. కనకనే నేను కవి నయ్యాను," అన్నాడు.

రంగయ్య కొంచెం ఆలోచించి, "నేను ఒక విషయం అడుగుతాను, ఏమీ అనుకోరు గద? ఈ కవిత్వం మీకు తిండి పెట్టుతున్నదా?" అని అడిగాడు.

శేషాచార్యులుకు వాడి ప్రశ్న తెలివిగా కనిపించింది. ఆయన వాడితో, "ఇప్పుడు కవులను పోషించే రాజులూ, కవిత్వాన్ని ఆదరించే మహానుభావులూ ఎవరున్నారు గనక? మా తాత గోవర్ధనాచార్యులు సిద్ధాపురం సంస్థానంలో పేరు మోసిన కవి. రాజా రఘుపతిరావుగారు మా తాత గారి కవితా మాధుర్యానికి పరవశులై, ఆయనకు కనకాభిషేకం చేసి, లక్ష వరహాలు కానుకగా ఇచ్చారట. అప్పటికి నేను చాలా చిన్నవాణ్ణి," అన్నాడు.

రంగయ్య ఇంకేమీ మాట్లాడకుండా బండి తోలటంలో నిమగ్నుడయ్యాడు.

మధ్యాన్నమయింది. మధ్య దారిలో శేషాచార్యులు, "చూడు, రంగయ్యా. కొంచెం బండి ఆపావంటే, దూరంగా కనిపించే గ్రామంలో దాహం తీర్చుకు వస్తాను," అన్నాడు.

రంగయ్య బండి ఆపి, "మీరు దిగకండి. నేను వెళ్ళి, మీ పనికి తగిన బందోబస్తు చేస్తాను," అంటూ, చేలకు అడ్డంపడి పరిగెత్తి వెళ్ళి, కొంత సేపటికి,



ఒక బ్రాహ్మణ కుర్రవాడి చేత పెద్ద చెంబులో మజ్జిగ పట్టించుకుని వచ్చాడు.

శేషాచార్యులు ఆ మజ్జిగతాగి, బ్రాహ్మణ వటువును పంపేసి, "రంగయ్యా, నీది ఎంత దొడ్డబుద్ధి!" అని మెచ్చుకున్నాడు.

"దానిదేముంది లెండి?" అంటూ రంగయ్య బండీ తోలాడు. సాయంకాలానికి బండి వెంకటాపురం చేరింది. శేషాచార్యులు ఇంట్లోకి వెళ్ళి, తన పని మనిషి ద్వారా రంగయ్యకు బండి బాడుగ అయిదువరహాలూ పంపాడు.

రంగయ్య బండీని తోలుకుపోతూ, "డబ్బులు వద్దన్నానని అయ్యగారితో చెప్పు," అని పనిమనిషితో అన్నాడు. పనిమనిషి ఈ మాట చెప్పేసరికి శేషాచార్యులు విస్తుపోయి, బయటికి వచ్చి చూశాడు. బండి అప్పటికే చాలా దూరం పోయింది. శేషాచార్యులు చప్పట్లు కొట్టి బండిని ఆపి, దగ్గిరికి వెళ్ళి, రంగయ్య వద్దంటున్నా, బలవంతంగా డబ్బు ఇయ్యబోయాడు.

రంగయ్య ఆయనతో, "మీరే చెప్పండి, ఒకరికి దానం ఇచ్చినది తిరిగి తీసుకో వచ్చునంటారా?" అన్నాడు.

శేషాచార్యులుకు ఆ మాట అర్థం కాక, "నీ మనసులో ఏ మున్నదో సరిగా చెప్పు," అన్నాడు.

"మీరు నాకు ఇచ్చే బాడుగ రాజా రఘుపతిరావుగారు మీ తాతగారికి చేసినదానం కాదా?" అన్నాడు రంగయ్య.

"నిజమే, కాదని ఎలా అనగలను?" అన్నాడు శేషాచార్యులు.

"రాజా రఘుపతిరావుగారు మా తాతగారు. అయితే నేను మీకు కనకాభిషేకం కాదుగదా, దుశ్శాలువలు కూడా కప్పలేని స్థితిలో ఉన్నాను. మిమ్మల్ని నా బండిలో తీసుకు వచ్చినందుకే ఉప్పొంగి పోతున్నాను. మీ నుంచి చిల్లిగవ్వ కూడా తీసుకోలేను. క్షమించండి," అంటూ రంగయ్య బండి తోలుకుపోయాడు. శేషాచార్యులు కొయ్యబారిపోయి, బండీ కేసి చూస్తూ నిలబడిపోయాడు.





# మంత్రించిన నిమ్మకాయ

పూర్వం ఒక నగరంలో రామనాధుడు అనే వైద్యుడు ఉండేవాడు. ఆయన హస్తవాసి మంచిదని చెప్పుకునే వారు. ఆయన వైద్యవృత్తిలో బాగా సంపాదించాడు.

ఆయన కొడుకు శంభునాధుడు తండ్రి వద్దనే వైద్యం నేర్చుకుని, యుక్త వయసులో పెళ్ళి చేసుకున్నాడు.

కాలక్రమాన రామనాధుడు వృద్ధుడై, తన కొడుకునూ, కోడలినీ, మనమలనూ, మనమరాళ్ళనూ చూసుకుంటూ జీవించి, చివరకు కన్ను మూశాడు. రామనాధుడు పోయినాక సంచి కట్టు పూర్తిగా శంభునాధుడి చేతికి వచ్చింది. అయితే ఏ కారణం చేతనో ప్రజలు శంభునాధుడి వద్దకు వైద్యానికి రావటం మానేశారు. వచ్చేవారి సంఖ్య రానురాను తగ్గిపోతూ వస్తున్నది.

దీనికి కారణం ఏమిటో శంభునాధుడికి ఎంత ఆలోచించినా తెలియలేదు. తన తండ్రి మీద ఉన్నగురి ప్రజలకు తన మీద లేదుకాబోలు ననుకున్నాడు. కాని అతనికి 'రానురాను జరుగుబాటే కష్టం అయింది. తండ్రి సంపాదించినది క్రమంగా తరిగి పోతున్నది. ఇంకో పని చేసుకుందామన్నా అతనికి వైద్యం తప్ప మరే విద్యారాదు.

ఒకరోజు అతని భార్య అతను భోజనం చేస్తూండగా అతనికి విసురుతూ, "ఊరి చివర కొండగుహలో ఎవరో స్వాములవారున్నారట. ఆయన విభూతి మంత్రించి ఇచ్చి అందరి రోగాలూ పోగొట్టుతున్నారట," అన్నది.

ఈ మాట విని శంభునాధుడు ఆశ్చర్యపోయాడు. విభూతితో అన్ని రోగాలూ నయం అవుతాయంటే అతనికి నమ్మకం

కుమారి సరస్వతీరావ్

కలగలేదు. అతను ఆ సాయంత్రం ప్రజలతో కలిసి గుహకు వెళ్ళాడు.

గుహలో స్వాములవారు ఉన్నాడు. ఆయన కాషాయ వస్త్రాలూ, ముఖాన విభూతీ ధరించి ఉన్నాడు. ఆయన చేతిలో రుద్రాక్షమాలా, పక్కన కమండలమూ ఉన్నాయి. ప్రజలు గుంపులు గుంపులుగా ఆయన చుట్టూ మూగి ఉన్నారు. ఆయన అందరికీ విభూతి పంచుతున్నాడు. దాన్ని తీసుకున్నవారు స్వాములవారికి పళ్ళూ, తినుబండారాలూ, పువ్వులూ, వస్త్రాలూ సమర్పించి వెళ్ళిపోతున్నారు.

ఇదంతా చూసి శంభునాథుడు ఇంటికి తిరిగివచ్చాడు. అది మొదలు అతనిలో మార్పు రావటం అతని భార్య గమనించింది. అతను రోజూ ఉదయం స్నానం చేసి, ఆదిపరాశక్తి ముందు కూర్చుని, తన ముందు పువ్వులూ, నిమ్మకాయలూ పెట్టుకుని, గంటల తరబడి పూజ చేస్తున్నాడు. అతని భార్య వారికీ, వీరికీ సహాయపడి సంసారం గడుపుతున్నది.

ఒకనాడు శంభునాథుడు పూజలో ఉండగా, బయట వీధిలో ఎవరో గొల్లున ఏడవటం వినిపించింది. అతను బయటికి వచ్చి చూశాడు. ఒక తల్లి ఒక కుర్రవాణ్ణి భుజాన వేసుకుని ఏడుస్తూ పోతున్నది. శంభునాథుడు ఆమెను ఆపి, ఏమయిందని అడిగాడు.

"మా అబ్బాయి స్పృహ తప్పి పడిపోయాడు, బాబూ. స్వాములవారి దగ్గి



రికి తీసుకు పోతున్నాను. అంతదాకా బతుకుతాడో, లేదో!'' అంటూ ఆమె ఏడ్చింది.

శంభునాధుడు ఆమెను లోపలికి రమ్మని, తన పూజామందిరంలోకి తీసుకుపోయి, దేవికి నమస్కారం చేసి, నిమ్మకాయ ఒకటి తీసి మంత్రించి, దాన్ని కోసి రసం ఒక గ్లాసులో పిండి, అందులో ఇంత ఉప్పు కలిపి ఒక పక్కన పెట్టి, పిల్లవాడి ముఖాన నీరు చల్లి స్పృహ తెప్పించి, వాడిచేత ఆ రసం తాగించాడు.

అరగంట తరవాత ఆ కుర్రవాడు మామూలుగా అయాడు. వాడి తల్లి శంభునాధుడి కాళ్ళమీద పడి దణ్ణం పెట్టింది.

''నాకు కాదు, ఆ దేవికి పెట్టు,'' అన్నాడు శంభునాధుడు.

ఆమె దేవికి దణ్ణంపెట్టి, కుర్రవాణ్ణి తీసుకుని వెళ్ళిపోయింది. ఆమె శంభునాధుడి మహిమ గురించి ఊళ్ళో బాగా ప్రచారం చేసింది. అది మొదలు శంభునాధుడి దగ్గిరికి రోగులు రాసాగారు. ఎవరు ఏ రోగంతో వచ్చినా శంభునాధుడు వారికి నిమ్మకాయ మంత్రించి ఇచ్చి, దాన్ని ఎలా వాడాలో చెప్పేవాడు. అతను ఎవరినీ ఏమీ అడిగే వాడు కాదు. ఏమి ఇస్తే అది తీసుకునే వాడు.

రాను రాను శంభునాధుడి ఇంటికి తండోప తండాలుగా జనం రాసాగారు. శంభునాధుడికి రోజులు హాయిగా గడిచి



పోతున్నాయి. అతని భార్యా, పిల్లలూ మంచి మంచి బట్టలు కట్టుకుని, చక్కగా తింటూ కళకళలాడుతున్నారు.

ఒక రోజు శంభునాధుడి ఆఖరు కొడుక్కు కంటి మీద కురుపులు వచ్చాయి. అతని భార్య వాణ్ణి అతనికి చూపింది.

"బుట్టలోవి రెండు నిమ్మకాయలు తీసి, వాటి రసం నీళ్ళలో కలిపి, వాడికి స్నానం చేయించు. పది రోజుల్లో కురుపు లన్నీ తగ్గిపోతాయి," అన్నాడు శంభునాధుడు.

భార్య ఆశ్చర్యపోయి, "నిమ్మకాయ లను అమ్మవారికి నైవేద్యం పెట్టి, మంత్రించ వద్దూ?" అని అడిగింది.

శంభునాధుడు నవ్వి, "పిచ్చిదానా, నాకు మంత్రాలేం వచ్చును? మా నాన్న బతికున్నన్నాళ్ళూ నిమ్మకాయ వైద్యమే చేశాడు. సర్వరోగ నివారిణి అంటూ ఉంటే అది నిమ్మకాయే. అనుపానాలు మార్చి దానితో అన్ని రోగాలూ నయం చెయ్యవచ్చు. మా నాన్న ఆ వైద్యంలో ఘటికుడు, నాకూ అదే నేర్పాడు. అయితే స్వాములవారి మీద గురికుదిరి ప్రజలకు వైద్యంలో నమ్మకం పోయింది. ప్రజలకు స్వాములవారి విభూతిలో ఎంతో కాలం నమ్మకం నిలవదని తెలుసు. అందుచేత వాళ్ళకు నాలో నమ్మకం గలగటానికి ఈ నాటకం ఆడాను. అయితే నేను నిజమైన వైద్యం చేశాను గనక నాలో ప్రజలకు నమ్మకం పోదు," అన్నాడు.

అతని భార్యకు అంతా అర్థమయింది. తన మామగారు దొడ్లో నిమ్మచెట్లను అమిత శ్రద్ధగా పెంచడమూ, నిమ్మ రసంతో ఏవేవో మందులు తయారు చేస్తూ ఉండటమూ ఆమెకు గుర్తు వచ్చింది.

ఆమె తన భర్త చెప్పినట్టే నిమ్మ కాయల రసం కలిపిన నీళ్ళతో పిల్ల వాడికి స్నానాలు చేయించి, వాడి కళ్ళ కురుపులు నయం చేసింది.





# నిజాయితీపరుడు

ఖలీఫా హరూన్ అల్‌రషీద్ తర్వాత బాగ్దాద్ నగరాన్ని పరిపాలించిన వారిలో అబ్దుల్ అజీజ్ ముఖ్యుడు. ఆయన స్వతహాగా మంచివాడు. అంతేగాక దాన ధర్మాలు చేయడంలో అతని చేతికి ఎముక లేదని ప్రతీతి. ఆ పాదుషా విధించే శిక్షలు చిత్రంగా ఉండేవి. కొరడా దెబ్బలు, కారాగార శిక్ష, ఉరిశిక్ష వంటివి విధించేవాడు కాదు. ప్రజలు చేసిన తప్పుపని వారి మనసులో బాగా నాటుకుపోయేటట్టు, తెలిసేటట్టు చేసి చాతుర్యంగా తీర్పు చెప్పేవాడు. దానితో తప్పు చేసిన వాడికి అవమానమై తిరిగి అటువంటి పని జన్మలో చేసేవాడు కాదు. ఆ రాజులో ఉన్న మరో గుణమేమిటంటే నిజాయితీగా నడుచుకునే వారికి తగిన బహుమానాలిచ్చి సత్కరించేవాడు. అందువల్ల అతని కాలంలో దొంగతనాలు గాని, యితర అవినీతికరమైన పనులుగాని చాలా తక్కువ జరిగేవి.

ఒకరోజు అబ్దుల్ అజీజ్‌కు చాలా కాలం తర్వాత మగపిల్లవాడు పుట్టడంతో సంతోషంగా పేదప్రజలకు విరివిగా దాన ధర్మాలు చేశాడు. అలా ఆయన వద్ద నుంచి ఓ బస్తా ధాన్యం తీసుకున్న ఓ పేదవాడు ఇంటికి పోయి బస్తా విప్పాడు. ధాన్యం లోపల వాడికి ఒక బంగారు నాణెం కనబడింది. వెంటనే వాడి భార్య అది చూచి, ''ఎక్కడిది ఆ బంగారు నాణెం?'' అని అడిగింది.

వాడు జరిగినది చెప్పి, ఆ నాణాన్ని తిరిగి పాదుషాకు యివ్వాలనుకుంటున్నానని అన్నాడు, ''నీ మొహం! నీ బుద్ధిగాని గాలికి ఎగిరిపోలేదు కదా! నిక్షేపంగా వచ్చిన బంగారును తిరిగి పాదుషాగారికి యిస్తావా?'' అన్నది వాడి భార్య.

సయ్యద్ అన్వరుల్ హక్

''నువ్వారుకో! పొరపాటు వల్ల ఆ నాణెం ధాన్యం మూటలో వచ్చింది. అది మనం ఉంచుకొనడం న్యాయం కాదు. మంచిగా ఉన్నవాడికే ఏనాటికైనా న్యాయం లభిస్తుంది,'' అని వాడు, భార్య ఎంత మొత్తుకుంటున్నప్పటికీ వినక తీసుకెళ్ళి పాదుషాకిచ్చాడు.

అబ్దుల్ అజీజ్ ఆ పేదయువకుడి నిజాయితీకి మెచ్చి నూరు బంగారు నాణెములు ఇచ్చాడు.

ఇదంతా గమనించిన బషీర్ అనే ఓ షావుకారు బీదవాడి వేషం వేసుకుని ఏభై బంగారు నాణెములు తన సొంతవి తీసుకొని పాదుషా వద్దకు వెళ్ళి ఎంతో వినయం నటిస్తూ, ''మహాప్రభూ! మీరు నిన్న నాకు ఇచ్చిన ధాన్యం మూటలో ఈ ఏభై బంగారు నాణెములు దొరికాయి. వీటిని న్యాయంగా తిరిగి తెచ్చాను. దయ చేసి స్వీకరించండి,'' అన్నాడు, తనకు తిరిగి ఐదువందల బంగారు నాణెములు వస్తాయన్న ఆశతో.

అపుడు అబ్దుల్ అజీజ్ బషీర్ కేసి ఆశ్చర్యంగా చూశాడు. బషీర్ భోజన ప్రియుడు కావడంవల్ల మనిషి బొద్దుగా, పుష్టుగా, బలంగా ఉన్నాడు. పైగా పేద వాడి వేషం ధరించినా, కుడిచేతికున్న నాలుగు బంగారపుటుంగరాలూ, ఎడమ చేతికున్న రెండు వజ్రపుటుంగరాలూ తీయడం మర్చిపోయి అలానే వచ్చాడు. అవే అతని అసలు స్వరూపాన్ని పట్టి యిచ్చాయి. బషీర్ నిజమైన పేదవాడు కాదనీ, ఎక్కువ బంగారు నాణెములు సంపాదించేందుకు వచ్చాడనీ గ్రహించ డానికి పాదుషాకు ఎంతోసేపు పట్టలేదు. అపుడాయన తన మంత్రితో, ''మంత్రి గారూ! ఇతడు యిచ్చిన బంగారు నాణె ములు తీసుకొని ఖజానాలో వేయండి. నిజాయితీగ వాటిని తిరిగి తెచ్చాడు గనుక యితని పేర ఓ నిజాయితీ పత్రం వ్రాసి యితనికిచ్చి పంపండి,'' అన్నాడు.

బషీర్ ముఖంలో కత్తివాటుకు నెత్తురు చుక్కలేదు!






ధృతరాష్ట్రుడు తన అతిథులకు తాను తినే దుంపలూ, పళ్ళూ పెట్టాడు. ఆ రాత్రి పాండవులు తమ తల్లికి నాలుగు వైపులా పడుకున్నారు. మర్నాడు వాళ్ళు స్త్రీలనూ, పురోహితులనూ వెంటబెట్టుకుని చుట్టుపట్ల ప్రదేశాలు చూడబోయారు. ఒక చోట అగ్నివేదికలు కనిపించాయి. అగ్నులు మండుతున్నాయి. వాటిలో మునులు హోమాలు చేస్తున్నారు. అక్కడ మృగాలు గుంపులు గుంపులుగా, ఎలాటి భయమూ లేకుండా సంచరిస్తున్నాయి. అలాగే రకరకాల పక్షులు కూడా స్వేచ్ఛగా సంచరిస్తున్నాయి. పాండవులు ఆ ఆశ్రమం పర్యటించి, అక్కడి మునులకు వివిధ చర్మాలూ, కంబళాలూ ఇచ్చి, ధృతరాష్ట్రుడి వద్దకు తిరిగి వచ్చారు.

ఆ సమయంలో వ్యాసుడు తన శిష్యులతో సహా అక్కడికి వచ్చాడు. ఆయన ధృతరాష్ట్రుడితో, "వనవాసం నీకు సుఖంగా ఉంటున్నదా? పుత్రశోకం నిన్నిప్పుడు బాధించటం లేదు గదా? గాంధారి నీ మూలాన కష్టాలు పడటం లేదు గద? కుంతి మిమ్మల్ని చక్కగా కనిపెట్టి ఉంటున్నది గద?" అని కుశలం అడిగాడు.

తరవాత ఆయన విదురుణ్ణి గురించి చెబుతూ, "విదురుడే ధర్మరాజు. మాండవ్యమహాముని శాపం చేత యమధర్మరాజు విదురుడుగా నీకు తమ్ముడై

64. ధృతరాష్ట్రుని మరణం



పుట్టాడు. ఆ యమధర్మరాజే తన యోగ బలంతో ధర్మరాజు కూడా అయాడు. అందుకే విదురుడు ధర్మరాజులో ఐక్యమయాడు. అందుకోసం అతను తన యోగ బలాన్ని ఉపయోగించుకున్నాడు." అన్నాడు.

పాండవులు తమ పరివారంతో సహా ఆ ఆశ్రమంలో నెల రోజులు గడిపారు. ఆ తరవాత మళ్ళీ వ్యాసుడు అక్కడికి వచ్చాడు. కథలతో అందరికీ మంచి కాలక్షేపం జరిగింది. అంతలో అక్కడికి నారదుడూ, పర్వతుడూ, దేవలుడూ, విశ్వావసుడూ, తుంబురుడూ, చిత్రసేనుడూ వచ్చారు. ధృతరాష్ట్రుడి అనుమతితో ధర్మరాజు వారినందరినీ సత్కరించాడు. వ్యాసుడూ, ఇతర అతిథులూ, పాండవులూ, ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతీ, ద్రౌపదీ, సుభద్రా మొదలైన స్త్రీలూ కూర్చున్నారు. ప్రాచీన మహర్షుల కథలూ, దేవాసురుల కథలూ చెప్పుకున్నారు.

ఒకసారి ధృతరాష్ట్రుడు వ్యాసుడితో, "మీరు రావటం వల్ల నా జన్మ సఫలమయింది. నాకు పరలోక భయంలేదు. కాని, నన్ను వేధిస్తున్న దేమిటంటే, నా కొడుకుల పాపబుద్ధి మూలంగా పుణ్యాత్ములైన పాండవులు అవమానం పొందారు. ఎందరో యువకులు యుద్ధంలో ప్రాణాలు పోగొట్టుకున్నారు. యుద్ధంలో చచ్చిన నా కొడుకులకూ, వారి కొడుకులకూ ఏం గతి కలుగుతుందో? రాత్రింబవళ్ళు నా కిదే మనోవేదన. అందు చేత నాకు శాంతి లేకుండా ఉన్నది." అన్నాడు.

ధృతరాష్ట్రుడు ఇలా అనే సరికి గాంధారికి దుఃఖం పొంగి వచ్చింది. ఆమెతో బాటు కుంతీ, ద్రౌపదీ, సుభద్రా, ఇతర స్త్రీలూ ఏడవసాగారు. గాంధారి చేతులు జోడించి వ్యాసుడికి నమస్కారం చేసి, "మా కొడుకులు పోయి పదహారేళ్ళయింది. ఇంత కాలమూ నా భర్త వారి కోసం దుఃఖిస్తూనే ఉన్నాడు. ద్రౌపది

తన కొడుకుల కోసమూ, అన్నల కోసమూ ఏడుస్తున్నది. సుభద్ర అభిమన్యుడి కోసం ఏడుస్తున్నది. ఈ భూరిశ్రవుడి భార్య తన మామగారినీ, భర్తనూ, కొడుకునూ పోగొట్టుకుని ఏడుస్తున్నది. మా కొడుకుల భార్యలు నూరుగురూ ఏడుస్తున్నారు. ఇంత మంది దుఃఖమూ పోగొట్టే ఉపాయం ఉంటే చూడండి.'' అన్నది.

వ్యాసుడు కుంతిని, ''నీ మనసులో ఏదో ఉన్నది. ఏమిటది?'' అని అడిగాడు. తాను కర్ణుడి కోసం దుఃఖిస్తున్నట్టు కుంతి చెప్పింది.



వ్యాసుడు గాంధారితో, "నువు నీ కొడుకులనూ, బంధువుల నందరినీ చూస్తావు. కుంతి కర్ణుణ్ణి, సుభద్ర అభిమన్యుణ్ణి, ద్రౌపది తన కొడుకులనూ, తండ్రినీ, అన్నలనూ చూస్తారు. ఈ ఆలోచన నాకు ముందే ఉన్నది. దాన్ని నువూ, కుంతీ బయటికి లాగారు. మీరు ఎవరి కోసమూ దుఃఖించే అవసరం లేదు. భారత యుద్ధంలో చనిపోయిన వారందరూ వేరు వేరు అంశలతో పుట్టిన దేవతలూ, రాక్షసులూనూ. ధృతరాష్ట్రుడు ఒక గంధర్వ రాజు. పాండురాజు మరుత్తుల గణానికి చెందినవాడు. విదురుడూ, ధర్మరాజూ యముడి అంశన పుట్టిన వాళ్ళు. దుర్యోధనుడు కలి, శకుని ద్వాపరం. దుశ్శాసనుడు మొదలైన వారందరిదీ రాక్షసాంశ. భీముడు వాయువు అంశనా, అర్జునుడు నరు డనే మహర్షి అంశనా, నకుల సహదేవులు అశ్వినుల అంశనా, అభిమన్యుడు చంద్రుడి అంశనా, ద్రౌపదీ ధృష్టద్యుమ్ములు అగ్ని అంశనా పుట్టారు. శిఖండిది రాక్షసాంశ. బృహస్పతి అంశన ద్రోణుడూ, శంకరుడి అంశన అశ్వత్థామా పుట్టారు. భీష్ముడు వసువులలో ఒకడు. మీరందరూ భాగీరథీ తీరానికి వెళ్ళండి. యుద్ధంలో చనిపోయిన వారి నందరినీ అక్కడ మీకు చూపించి, మీ దుఃఖం పోగొట్టుతాను,'' అన్నాడు.



ఈ మాటలు వినే సరికి అందరికీ గొప్ప ఉత్సాహం పుట్టుకొచ్చింది. అందరూ గంగాతీరానికి బయలుదేరారు. ధృతరాష్ట్రుడు పాండవులనూ, మునులనూ, ఇతరులనూ వెంట తీసుకుపోయాడు. అందరూ గంగా తీరం చేరి, తగిన ప్రదేశంలో పగలంతా విశ్రమించారు. సూర్యుడు అస్తమించాడు. అందరూ స్నానాలు చేసి, కాలకృత్యాలు నిర్వర్తించారు.

అనంతరం అందరూ వ్యాసుడి వద్ద చేరారు. అప్పుడు వ్యాసుడు గంగా జలంలో మునిగి, పాండవ, కౌరవ యోధులనూ, భారత యుద్ధంలో చనిపోయిన నానా రాజులనూ రమ్మని పిలిచాడు.

వెంటనే నదీతీరం వెంబడి పెద్ద కలకలం వినిపించింది. పూర్వంలాగే కౌరవ పాండవ సేనలు కనిపించాయి. భీష్ముడూ, ద్రోణుడూ మొదలైన వారు ఒక్కరొక్కరే నదిలో నుంచి రాసాగారు. విరాటుడూ, ద్రుపదుడూ, ఉప పాండవులూ, అభిమన్యుడూ, ఘటోత్కచుడూ, కర్ణుడూ, దుర్యోధనుడూ మొదలైన వారందరూ పూర్వం ఏయే వేషాలలో యుద్ధానికి వెళ్ళారో ఆ వేషాలతో, అవే వాహనాలపైన గంగ నుంచి వెలువడి వచ్చారు. వారి మధ్య ఇప్పుడు వైరాలేమీ లేవు. వ్యాసుడు తన తపశ్శక్తితో ధృతరాష్ట్రుడికి దివ్యదృష్టి ఇచ్చాడు. గాంధారీ ధృతరాష్ట్రులిద్దరూ తమ వారినందరినీ చూడగలిగారు. మిగిలిన వాళ్ళకు కూడా, చచ్చిపోయిన వారంతా ఇలా తిరిగి రావటం మహాద్భుతమనిపించి, గగుర్పాటు కలిగింది.

బతికున్న వారు చచ్చిపోయిన వారిని కలుసుకుని ఎంతో ఆనందించారు. పాండవులు కర్ణుణ్ణీ, అభిమన్యుణ్ణీ, ఉపపాండవులనూ కలుసుకున్నారు. ఆ రాత్రి అందరికీ ఎంతో సంతోషంగా గడిచింది. తరవాత చచ్చిన వారంతా ఎలా వచ్చారో



పాండవులను ఆయన హస్తినాపురానికి తిరిగి వెళ్ళమనీ, రాజ్యం చూసుకోమనీ హెచ్చరించాడు. ధర్మరాజుకు వెళ్ళిపోవాలని లేదు. రాజ్యం చెయ్యాలనీ లేదు. రాజ్యం శూన్యంగా ఉన్నది. ధర్మరాజు లాగే సహదేవుడికి కూడా కుంతిని వదిలిపెట్టి పోవటం ఇష్టం లేదు. కాని కుంతి వాళ్ళను హస్తినాపురానికి తిరిగి పొండి అని గట్టిగా చెప్పింది. వాళ్ళు వెళ్ళక తప్పలేదు. ధృతరాష్ట్రుడు పాండవులను అయిదుగురినీ కౌగలించుకుని, వీడ్కోలు చెప్పాడు. ధర్మరాజు సపరివారంగా హస్తినాపురానికి బయలుదేరాడు.

అలాగే గంగలో ప్రవేశించి అదృశ్యమైపోయారు. ఎవరెవరు ఏయే లోకాల నుంచి వచ్చారో ఆ లోకాలకు తిరిగి వెళ్ళిపోయారు.

వ్యాసుడు బతికున్న కౌరవ కాంతలతో, "మీలో ఎవరైనా భర్తల వెంట వారుండే లోకాలకు పోదలిస్తే నదిలో ప్రవేశించండి," అన్నాడు. ధృతరాష్ట్రుడి కోడళ్ళు తమ అత్తమామల అనుమతితో గంగలో ప్రవేశించారు.

ఈ సంఘటన జరిగిన అనంతరం ధృతరాష్ట్రుడి దుఃఖం పూర్తిగాపోయింది. ఆయన తన ఆశ్రమానికి తిరిగి వెళ్ళాడు. నెల రోజులకు పైగా తన వెంట ఉన్న

తరవాత కొంతకాలానికి ధర్మరాజును చూడటానికి నారదుడు వచ్చాడు. ధర్మరాజు ఆయనకు సకలమర్యాదలూ చేసి, కుశల ప్రశ్నలు చేశాడు. తాను గంగా తీరాన తపోవనాలు చూసి వస్తున్నానని నారదుడు చెప్పేసరికి, ధర్మరాజు, "మా పెత్తండ్రి కనిపించాడా? కులాసాగా ఉన్నాడా? గాంధారీ, కుంతీ, సంజయుడూ ఎలా ఉన్నారు?" అంటూ అడిగాడు.

దానికి నారదుడు ఇలా చెప్పాడు:

"ధర్మరాజా, మీ అన్నదమ్ములు వచ్చేసిన అనంతరం ధృతరాష్ట్రుడు గాంధారీ, కుంతీలతో కురుక్షేత్రం నుంచి గంగా

ద్వారం వెళ్లాడు. సంజయుడూ, యాజకులైన బ్రాహ్మణులూ అగ్నిహోత్రాలు తీసుకుపోయారు. గంగాద్వారం వద్ద నీ పెత్తండ్రి వాయుభక్షణ అవలంబించి ఆరుమాసాల పాటు కఠోరమైన తపస్సు చేశాడు. గాంధారి జలాహారం తీసుకున్నది. కుంతి మాసోపవాస వ్రతం పట్టింది. సంజయుడు రోజుకు ఒక్కభోజనం చేశాడు. యాజకులు మాత్రం విడవకుండా అగ్నిహోత్రాలు వ్రేల్చారు. తరవాత ధృతరాష్ట్రుడు ఎవరినీ పాటించకుండా వనాలలో తిరగసాగాడు. సంజయుడు ఆయనకు తోడు వెళ్ళాడు. గాంధారీ, కుంతీ ఆయన వెనకనే తిరిగారు. కుంతి గాంధారిని కనిపెట్టుకుని ఉండేది. ఇంతలో ఒకనాడు ధృతరాష్ట్రుడు గంగలో స్నానం చేసి, తన ఆశ్రమం కేసి వస్తూండగా, అరణ్యం అంతా అంటుకున్నది.

కార్చిచ్చు తమకు సమీపంలోకి వచ్చిందని తెలిసి ధృతరాష్ట్రుడు సంజయుడితో, "నువు అగ్నిలేని దిక్కుగా వెళ్ళిపో. మేం ఈ అగ్నిలో కాలి ఉత్తమ గతికి పోతాం," అన్నాడు.

సంజయుడు ఆదుర్దాగా, "రాజా, నువు అగ్నిలో మరణించటం నాకిష్టం లేదు. అగ్ని చూడబోతే చుట్టుముట్టింది. ఏం చెయ్యాలి?" అన్నాడు.



"సంజయా, తపస్వులు గాలీ, నీరూ, నిప్పూ—దేనితోనైనా చావటానికి ఇష్టపడతారు. నువు తాత్సారం చెయ్యక వెళ్ళిపో," అన్నాడు ధృతరాష్ట్రుడు.

సంజయుడు ధృతరాష్ట్రుడికీ, కుంతీ గాంధారీలకూ ప్రదక్షిణం చేసి, వారిని యోగ సమాధిలోకి పొమ్మని చెప్పాడు. ముగ్గురూ అలాగే చేశారు. సంజయుడు కార్చిచ్చులో నుంచి బయటపడి గంగా తీరాన ఆశ్రమాలకు చేరుకుని నారదుణ్ణి చూశాడు. ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతీ కార్చిచ్చులో కాలిపోయారు. ఈ సంగతి నారదుడికి చెప్పి, సంజయుడు హిమాలయానికి వెళ్ళాడు.

ఈ వార్త తెలియగానే పాండవులతో బాటు నగరంలో అందరూ శోకించారు. కార్చిచ్చుకు కారణమైన అగ్ని ధృతరాష్ట్రుడి దేననీ, తన అగ్నితోనే తాను మరణించి ధృతరాష్ట్రుడు ఉత్తమ గతి పొందాడనీ నారదుడు ధర్మరాజును ఊరడించాడు.

ధర్మరాజు గంగను చేరి చనిపోయిన వారికి జలతర్పణాలు విడిచాడు. తరవాత శ్రాద్ధం పెట్టి, పన్నెండో నాడు దానాలు చేశాడు. భారత యుద్ధం ముగిసిన పద్దెనిమి దేళ్ళకు ధృతరాష్ట్రుడు పోయాడు. అందులో చివరి మూడేళ్ళు ఆయనకు వనవాసంలో గడిచాయి.

ధృతరాష్ట్రుడు పోయిన అనంతరం మరో పద్దెనిమిదేళ్ళు ధర్మరాజు రాజ్యం చేశాడు. ఆ సమయంలో ఆయనకు ఒక దారుణవార్త చేరింది; ముసలం (రోకలి) మూలాన యాదవు లందరూ చచ్చిపోయారట; కృష్ణుడూ, బలరాముడూ మాత్రమే మిగిలారట!

ధర్మరాజు తన తమ్ములను పిలిపించి, "యాదవు లందరూ తమలో తాము కొట్టుకుని చచ్చారట. ఇప్పుడేం చెయ్యాలి?" అని అడిగాడు.

యాదవ వినాశం ఎలా జరిగిందంటే:

ఒక సారి విశ్వామిత్రుడూ, కణ్వుడూ, నారదుడూ ద్వారకకు వెళ్ళారు. వాళ్ళు రావటం చూసి సారణుడు మొదలైన యాదవులు కొందరు సాంబుడికి ఆడ వేషం వేసి ఆ మునులకు చూపించి, "ఈవిడ గర్భిణి. ఈవిడ భర్త కొడుకు కావాలం టున్నాడు. ఈమెకు ఏ బిడ్డ పుట్టేదీ చెప్పండి," అని అడిగారు.

దానికి మునులు, "వృష్ణి, అంధక కులను నాశనం చేసే ముసలం ఒకటి సాంబుడికి పుట్టుతుంది," అని జవాబు చెప్పారు.

తరవాత ఆ మునులు కృష్ణుణ్ణి కలుసుకుని, జరిగినది చెప్పారు. కృష్ణుడు అది తెలుసుకుని మునులు శపించినట్టే జరుగుతుందని నిశ్చయం చేసుకున్నాడు.





# పంచతంత్రం [?]

## 13

గుంట నుంచి పైకి వచ్చిన మూడు మృగాలూ బ్రాహ్మడితో, "గుంటలో ఉన్న మనిషి పరమపాపి. వాణ్ణి బయటికి లాగకు, వాడి మాట నమ్మకు." అన్నాయి.

తరవాత పులి బ్రాహ్మడితో, "దూరాన కనబడే ఆ కొండ చూశావా? దాని ఉత్తర పార్శ్వపు లోయలో నా నివాసం. నువు అక్కడికి వచ్చినట్టయితే నీకు ప్రత్యుపకారం చేసి, నీ ఋణం తీర్చుకుంటాను." అన్నది.

అది వెళ్ళిపోగానే కోతి, "పులి ఉండే చోటుకు ఎదురుగా ఒక జలపాతం ఉన్నది. దాని సమీపంలో ఉన్న మర్రిచెట్టు నా నివాసం. నీకు అవసరం అని తోచినప్పుడు ఎప్పుడైనా అక్కడికి రా." అని వెళ్ళిపోయింది.

"నీకు ఎప్పుడైనా అపాయం తటస్థించినట్టయితే నన్ను తలుచుకో," అని పాము కూడా వెళ్ళిపోయింది.

జంతువులన్నీ వెళ్ళిపోయాక గోతిలో ఉన్న మనిషి, "బ్రాహ్మడా, నన్ను కూడా పైకి లాగు," అని కేక పెట్టాడు.

సాటివాడు గదా అని బ్రాహ్మడు జాలి దలచి ఆ మనిషిని కూడా పైకి లాగాడు.

పైకి వచ్చినాక వాడు, "నేను భరుకచ్ఛానికి చెందిన స్వర్ణకారుణ్ణి. నీ కేవైనా బంగారు నగలు చేయించుకోవాలని ఉంటే నా వద్దకు రా," అని చెప్పి వెళ్ళిపోయాడు.

తరవాత బ్రాహ్మడు చాలా రోజులు తిరిగాడు గాని ఏమీ సంపాదించలేకపోయాడు. అతను నిరాశతో ఇంటి ముఖం పట్టాడు. తిరుగు ప్రయాణంలో అతను

అట్ట చివరి బొమ్మ



59



కోతి ఉంటే చోటికి వెళ్ళాడు. కోతి అతనికి అమృతప్రాయమైన పళ్ళు తినటానికి ఇచ్చింది. వాటిని తిని అతను ఆకలి తీర్చుకున్నాడు.

కోతి అతనితో, ''పళ్ళు కావాలంటే రోజూ రా,'' అన్నది.

''నీ ఋణం తీరిపోయింది. పులిని చూపించు,'' అన్నాడు బ్రాహ్మడు.

కోతి అతనికి పులిని చూపింది. పులి అతనికి ఒక చంద్రహారమూ, ఇతర ఆభరణాలూ ఇస్తూ, ''ఎవరో రాజకుమారుడు ఎక్కిన గుర్రం అతని వశం తప్పి పరిగెత్తుతూ అతన్ని పడేసింది. అతను చచ్చిపోయాడు. అతని ఆభరణాలన్నీ నీ కోసం దాచి ఉంచాను. కనక వీటిని తీసుకుని, యథేచ్ఛగా వెళ్ళు,'' అన్నది.

బ్రాహ్మడు ఆ ఆభరణాలను తీసుకుని, స్వర్ణకారుడు వాటిని తన కోసం అమ్మిపెట్టగలడని ఆలోచించి, అతని వద్దకు వెళ్ళాడు.

స్వర్ణకారుడు అతనికి స్వాగతం చెప్పి, కాళ్ళు కడిగి, ఆసనం ఇచ్చి, విందు భోజనం పెట్టి, "నా వల్ల ఏమైనా కావాలంటే ఆజ్ఞాపించు,'' అన్నాడు.

''కొంత బంగారం తెచ్చాను. దాన్ని అమ్మిపెట్టు,'' అన్నాడు బ్రాహ్మడు.

స్వర్ణకారుడు బ్రాహ్మడి వద్ద నుంచి ఆభరణాలు తీసుకుని, అవి తాను రాజకుమారుడి కోసం చేసినవేనని గ్రహించాడు. ఆ రాజకుమారుడి కోసం వెతకగా వెతగా అతని శవం కీకారణ్యం మధ్య ఇటీవలనే దొరికింది. అతని నగలు మాత్రం లేవు. హత్య జరిగిందని నిర్ధారణ చేసుకుని, రాజు హంతకుణ్ణి పట్టి ఇచ్చిన వాడికి పెద్ద బహుమానం ప్రకటించాడు. ఈ బ్రాహ్మడే హంతకుడై ఉండాలనుకుని, స్వర్ణకారుడు బ్రాహ్మణ్ణి రాజుకు అప్పగించి బహుమానం పొంద నిశ్చయించాడు.

''అయ్యా, నువు ఇక్కడే ఉండు. నేను ఇద్దరు, ముగ్గురు బంగారు వర్తకు

లకు ఈ నగలు చూపించి, ఇప్పుడే వస్తాను,'' అని అతను రాజభవనానికి వెళ్ళి, రాజుకు ఆభరణాలు చూపించి, వాటిని తెచ్చిన బ్రాహ్మడు తన ఇంటి వద్ద ఉన్నాడని చెప్పాడు.

రాజభటులు వెళ్ళి, ఆ బ్రాహ్మణ్ణి చేతులూ, కాళ్ళూ బంధించి రాజు వద్దకు తెచ్చారు. ఆ బ్రాహ్మడు ఏమి చెప్పేదీ వినకుండానే రాజు అతనికి మరణ దండన విధించాడు.

అప్పుడు బ్రాహ్మడు పామును తలుచుకున్నాడు. వెంటనే పాము అతడి దగ్గిరకు వచ్చి, ''నా వల్ల ఏం సహాయం కావాలి?'' అని అడిగింది.

''నన్ను ఈ కాళ్ళకూ, చేతులకూ వున్న బంధాల నుంచీ, చెర నుంచీ విడిపించు,'' అన్నాడు బ్రాహ్మడు.

పాము బ్రాహ్మడికి చెప్పవలసినది చెప్పి, వెళ్ళి రాణిని కాటు వేసింది. అంతఃపురంలో రోదనధ్వనులు బయలుదేరాయి. నగరం అట్టుడికి పోయింది. వైద్యులూ, మంత్రవేత్తలూ, పాము మంత్రాలు తెలిసినవాళ్ళూ వచ్చి ఏమేమి తంత్రాలో చేశారు. కాని స్పృహతప్పి పడిపోయిన రాణి కళ్ళు తెరవలేదు.

రాజు హతాశుడై, రాణిని బతికించిన వారికి గొప్ప బహుమానం ఇస్తానని



దండోరా వేయించాడు. దండోరా విని, ఖైదులో ఉన్న బ్రాహ్మణుడు, రాణిని తాను బతికిస్తానన్నాడు. వెంటనే అతన్ని విడుదల చేసి, రాజు వద్దకు తీసుకుపోయారు. రాణికి చికిత్స చెయ్యటానికి రాజు అనుమతించాడు. బ్రాహ్మణుడు రాణి చెయ్యి తాకగానే విషం విరిగిపోయి, రాణి కళ్ళు తెరిచింది.

రాజు పరమానందభరితుడై, బ్రాహ్మణుడికి అంతులేని కానుక లిచ్చి, ''అయ్యా, మీకు ఆ నగలు ఎలా వచ్చాయి?'' అని అడిగాడు. బ్రాహ్మణుడు జరిగినదంతా చెప్పాడు. రాజు, కృతఘ్నుడైన స్వర్ణకారుడికి శిక్ష విధించి,

బ్రాహ్మణ్ణి తన మంత్రిగా నియమించి, అతనికి అనేక గ్రామాలు ఇచ్చాడు. బ్రాహ్మడు తన భార్యనూ, బిడ్డలనూ తెచ్చుకుని, వారితో సుఖంగా ఉన్నాడు.

పింగళకానికి కృతఘ్నుడి కథ చెప్పి దమనకం ఇంకా ఇలా అన్నది:

''మిత్రుడయేది, బంధువుడయేది, గురువయేది, రాజయేది నేరం చేస్తే దండన పొందాలని మనువు చెప్పాడు. మహారాజా, ఈ యెద్దు ద్రోహి. అతనితో అలాగే తమరు వ్యవహరించాలి. అతనితో పొత్తు పాముల పుట్టపై శయనించటం లాటిది, తగలబడుతున్న ఇంట నివసించడం లాటిది.''

''నువు చెప్పినది నిజమే, మిత్రమా. అందుచేత అతన్ని హెచ్చరిస్తాను,'' అన్నది పింగళకం.

''ఏమిటీ? హెచ్చరించటమా! అలాంటి వాడి పట్ల చర్యలే తప్ప మాటలు పనికిరావు. తమ చాటున ఇప్పటికే చాలా కాలం పుంజుకున్నాడు. నల్లి కథలోలాగ ఇతన్ని తక్షణం చంపి పారెయ్యాలి,'' అన్నది దమనకం.

''ఏమిటా కథ?'' అని పింగళకం అడిగింది.

దమనకం ఇలా చెప్పింది:

నల్లి కథ

పూర్వం ఒక రాజు ఉండేవాడు. అతనికి ఉత్తమమైన శయనాగారం ఉండేది. అందులో అత్యంత సుఖప్రదమైన పరుపు ఉండేది. ఆ పరుపు ముడతలలో, తెల్లని దుప్పటి కింద దాగి మందవిసర్పిణి అనే ఆడ పేను జీవిస్తూ, రోజూ పక్కలు పరిచేటప్పుడు తెలివిగా తప్పించుకునేది. దుప్పట్లు మార్చేటప్పుడు పరుపులో దాక్కునేది. రాత్రి పూట రాజు వచ్చి పడుకుని నిద్రపోగానే, ఆ పేను రాజు తలలో ప్రవేశించి, ఆయన రక్తం తాగేది. అది ఎంత నాజూకుగా రాజును కొరికేదంటే, ఆయనకు నిద్రాభంగం కలిగేది కాదు. ఇలా రాచనెత్తురు తాగి ఆ పేను తెగబలిసి, సుఖంగా జీవిస్తూ వచ్చింది.



# 151. వింత కొండలు

క్వాంగ్సీ రాష్ట్రం (చీనా) లోని ఈ సున్నపురాతి కొండలు విడ్డూరమైనవి. వీటిని గురించి ఒక కథ చెబుతారు. అనేక వందల సంవత్సరాల క్రితం ఒక చిత్రకారుడు ఈ కొండలలో ఒక దాని శిఖరం మీదికి ఎక్కి, అక్కడి నుంచి కనిపించే కొండల శ్రేణులను చిత్రించాడట. అతని బొమ్మలు చీనా అంతటా ప్రజాదరణ పొందటం వల్ల అన్ని ప్రాంతాలవారు కొంపలను ఆ విధంగానే చిత్రించ నారంభించారు. నిజానికి ఇలాటి కొండలు క్వాంగ్సీరాష్ట్రంలో మారుమూల మాత్రమే ఉన్నాయి.



Photo by K. S. Vijayaker



బహుమతి
పొందిన వ్యాఖ్య

చెప్పకపోతే చెలిమికి చేటు

పంపినవారు:
ఎల్. గౌరీశంకర్

Photo by N. M. Kutchiwala



సంతపేట,
ఒంగోలు.

చెయ్యకపోతే పనికి లోటు

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు జూలై 20 వ తేదీ లోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డు పైన మాత్రమే రాయాలి.

★ వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
సౌభాగ్య దేవుడు

మూడవ అట్ట:
వినోద మందిరం


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-600026. Controlling Editor: 'CHAKRAPANI'

*Photo by:* **P. B. KHATA**



WIZARD'S CASTLE

